Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 53 • 28-12-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





## ● ఢిల్లీ యువతి సామూహిక మానభంగంతో
# కాంగ్రెస్‌కు మరణ శాసనం!

ఢిల్లీ నగరంలో ఒక బస్సులో సామూహిక మాన భంగానికి గురైన యువతి ప్రాణం కాపాడడానికి కేంద్ర ప్రభుత్వం తన శక్తినంతా విని యోగిస్తున్నది. వందలాది మంది వైద్యులు ఆమెను కంటికి రెప్ప వలె కాపాడుతున్నారు. మరింత మెరుగైన చికిత్స కోసం సింగపూర్‌కు ప్రత్యేక అంబులెన్స్ విమానంలో తరలించారు. ఆమె ప్రముఖురాలు కాదు. అధికారంలో వున్న నేత అసలే కాదు. సగటు పౌరురాలు. ఆమె కోసం ప్రధానితో సహా ప్రభుత్వం సమస్తం తమ సమయాన్ని వినియోగించడానికి కారణం – ఆమెపై జరిగిన అత్యాచారం పౌర సమాజంలో సృష్టించిన సంచలనం. ప్రపంచంలో అత్యంత శక్తివంతులైన మహిళలలో సోనియాగాంధీ ఒకరు. ఆమె దర్శనం దొరకడం పెద్ద పెద్ద పదవులలో వున్న వారికి కూడా కష్ట సాధ్యం. అమెరికన్ అధ్యక్షుడు భారతదేశం వచ్చినా ఆమెను పలకరించకుండా పోలేదు. ముఖ్యమంత్రులు, కేంద్రమంత్రులు, గవర్నర్ల వంటివారు ఆమె ఇంటి ముందు పడిగాపులు పడుతుంటారు. కానీ అంత గొప్ప సోనియాగాంధీ ఢిల్లీ విద్యార్థుల పిలుపు వినగానే అర్ధరాత్రి ఇంటి బయటకు వచ్చింది. నడి వీధిలో క్రింద కూర్చుని వారితో చర్చలు జరిపింది. గంటపాటు వారి ఆవేశాన్ని సహనంతో భరించింది. దాన్నిబట్టే అర్థం చేసుకోవచ్చు ఈ మానభంగ దుర్ఘటనకు ఎంతటి రాజకీయ ప్రాధాన్యత లభిస్తున్నదో.

ఈ దుర్ఘటనతో కాంగ్రెస్‌కు కనీసపాటి సంబంధం కూడా లేదు. ఆ దుర్మార్గులు ఏ రాజకీయ పార్టీకి చెందని వారు. సమాజానికి పట్టిన చీడపురుగులు. దానవత్వం మూర్తీభవించిన రాక్షస మూక. దానికి జరిగిన, జరుగుతున్న నిరసన ఉద్యమకారులు కూడా రాజకీయ సంబంధీకులు కాదు. దేశ చరిత్రలో ఒక మానవీయ అంశంపై ప్రజలు ఇంతగా స్పందన చూపడం ఇదే ప్రథమం. అన్నా హజారే అవినీతి ఉద్యమం కంటే శక్తివంతమైన ఆందోళన ఇది. అన్నా హజారే తరఫున మేధావులున్నారు. స్వచ్ఛంద సంస్థలున్నాయి. సమాజంలో ఉన్నత స్థానాలలో వున్నవారు పేరు ప్రతిష్ఠలు కల్గినవారు వున్నారు. వారందరూ కలిసి ఉద్యమాన్ని వ్యవస్థీకరించారు. టీవీ ఛానళ్లు జనాన్ని సమీకరించడానికి సహకరించాయి. కానీ ఈ దుర్ఘటనపై జరుగుతున్న నిరసనలో అటువంటి ప్రమేయాలు ఏవీ లేవు. లక్షలాది మంది యువతీ యువకులు స్వచ్ఛందంగా రోడ్ల మీదకు వస్తున్నారు. పోలీసు లాఠీలకు ఎదురు నిలుస్తున్నారు. రాక్షస మూక దౌష్ట్యానికి గురైన నిర్భాగ్య యువతి వారికేమీ తల్లీ కాదు, చెల్లీ కాదు. ఆమె రూపు ఎట్లా వుంటుందో కనీసం పేరేమిటో కూడా తెలియదు. అయినా ఆగ్రహంతో మండి పడుతున్నారు. కోపంతో కుతకుత ఉడుకుతున్నారు. ఆవేశంతో ఒళ్లు మరచిపోతున్నారు. అందుకు కారణం వ్యవస్థ మీద వారికున్న ద్వేషం. వ్యవస్థను నడిపే నేతల మీద అక్కసు. ప్రభు

కొరవ 14వ పేజీలో

## ప్రాణం విడిచిన పేదల ప్రాణదాత



వైఎస్‌జగన్ పార్టీ కోశాధికారి పాలిచెర్ల రవి కిరణ్‌కుమార్‌రెడ్డి 25తేది అర్ధరాత్రి హైదరాబాదు అపోలో ఆస్పత్రిలో కన్ను మూశారు. పురుషులలో పుణ్యపురుషులుంటారనే నానుడికి ప్రత్యక్ష నిదర్శనం కిరణ్‌కుమార్‌రెడ్డి. బయట ప్రపంచానికి ఆయన గురించి చాలా తక్కువ తెలుసు. వైఎస్ ముఖ్యమంత్రిగా వున్నప్పుడు ఆయన కార్యదర్శిగా మాత్రమే తెలుసు. వైఎస్ దగ్గర చాలా మంది కార్యదర్శులుండే వారు. వారెవరికీ లేని గొప్పదనం కిరణ్‌కుమార్‌రెడ్డికి మాత్రమే వుంది. లక్షలాది మంది పేద ప్రజల ప్రాణప్రదాయనిగా మారిన ఆరోగ్యశ్రీ పథకం రూపశిల్పి కిరణ్‌కుమార్‌రెడ్డి. మొదటదాన్ని ప్రతిపాదించినప్పుడు వైఎస్ కూడా ఒప్పుకోలేదు. ఐఏఎస్‌లైతే తీసి పక్కన పడేశారు. కానీ కిరణ్ కుమార్‌రెడ్డి పట్టు వదలకుండా ఇన్సూరెన్స్, వైద్య రంగ నిపుణులతో విస్తృత చర్చలు జరిపి, సాధ్యాసాధ్యాల మీద నిశితమైన పరిశీలన జరిపి, అటు వైఎస్‌ను ఇటు ఐఏఎస్‌లను ఒప్పించి ఆరోగ్యశ్రీ అనే పేరు కూడా తానే పెట్టి, వైఎస్‌ను ఒప్పించాడు. కోట్లాది మంది ప్రజలకు ప్రాణహామీ

కొరవ 14వ పేజీలో

# నేతలకు రక్షణెందుకు?

ఢిల్లీ యువతిపై జరిగిన సామూహిక మానభంగ ఉదంతం పోలీసు వ్యవస్థ పనితీరుపై మౌలిక ప్రశ్నలు లేవనెత్తింది. ప్రజల మానప్రాణాలు రక్షించవలసిన బాధ్యతను విస్మరించి నేతల రక్షణకు అధిక సమయాన్ని, వనరులను వినియోగిస్తున్నారని అటు సాధారణ జనం, ఇటు మేధావి వర్గం కూడా ముక్త కంఠంతో నిరసిస్తున్నది. ఢిల్లీ నగరంలో దాదాపు 80వేల మంది పోలీసులున్నారట. కానీ అందులో ఖాళీగా వున్న పోస్టులు, నేతల రక్షణ, నేతల పర్యటనలకు బందోబస్తు విధులకు కేటాయింపులు పోను నిజంగా ప్రజల రక్షణకు వినియోగపడుతున్నది కేవలం 30 వేల మంది మాత్రమేనట. ఈ ఒక్క ఉదాహరణతోనే మన దేశంలో పోలీసు వ్యవస్థ పని తీరు ప్రజలకు ఎంతవరకు ఉపయోగపడుతున్నదీ అర్థం చేసుకోవచ్చు.

రాజకీయవాదులకు పోలీసు రక్షణ ఎంతవరకు అవసరం, ఎందుకు అవసరమన్నది ప్రాథమిక ప్రశ్న. ఏ ప్రజల ఓట్లతో అధికారంలోకి వస్తున్నారో అదే ప్రజల నుంచి రక్షణ కోరుతున్నారు రాజకీయవాదులు. తీవ్ర వాదం, నక్సలిజం వంటి హింసాయుత కార్యక్రమాల అణచివేతకు ప్రభుత్వ పరంగా విధాన నిర్ణయాలు తీసుకొన్నప్పుడు ఆయా మంత్రులు, అధికారులకు ప్రాణహాని ఏర్పడడం సహజం. ప్రజల కోసం తమ ప్రాణాలను పణంగా పెట్టి నిర్ణయాలు తీసుకొన్నారు కాబట్టి వారికి ప్రభుత్వపరంగా రక్షణ కల్పించడం ధర్మం. ఆ ఏర్పాటు లేకుంటే ఏ మంత్రి లేదా అధికారి కూడా ప్రభుత్వపరంగా విధాన నిర్ణయాలు తీసుకోలేరు. దానివల్ల ప్రజలకే నష్టం కలుగుతుంది.

అయితే ప్రభుత్వం నుంచి పోలీసు రక్షణ స్వీకరిస్తున్న రాజకీయవాదులలో ఎంతమందికి ఈ విధానపరమైన అర్హత వుందన్నది ప్రశ్న. మన దేశంలో కేంద్ర ప్రభుత్వ పరిధిలో నాలుగు రకాల రక్షణ వర్గాలున్నాయి. నేతల స్థాయి, వారి ప్రాణ హాని అవకాశాలనుబట్టి జడ్ ప్లస్, జడ్, వై, ఎక్స్ అనే నాలుగు తరగతులుగా విభజిస్తున్నారు. జడ్ ప్లస్‌లో రాష్ట్రపతి, ప్రధాని, మాజీ ప్రధానుల వంటి 15 మంది ఉన్నతస్థాయి వ్యక్తులున్నారు. ఈ తరగతి రక్షణకు ఒక్కొక్కరికి 300 మంది వరకు పోలీసులను వినియోగిస్తున్నారు. వీరిలో స్పెషల్ ప్రొటెక్షన్ గ్రూప్ ప్రధానమైనది. అమెరికన్ సీక్రెట్ సర్వీస్ తరహాలో శిక్షణ ఇస్తారు వీరికి. అందుకోసం సైన్యంలో, దేశంలోని వివిధ పోలీసు విభాగాలలో మెరికల వంటి యువకులను ఎంపిక చేస్తారు. వీరి ప్రధాన ఉద్దేశ్యం నేతల రక్షణ మాత్రమే. నేషనల్ సెక్యూరిటీ గార్డ్స్ అనే మరొక విభాగం వుంది. జడ్ కేటగిరి నేతల రక్షణకు వీరిని వాడుతారు. రాష్ట్రాల పోలీసులు కల్పించే బందోబస్తు, ఇళ్ల ముందు కాపలా వంటివి వీటికి అదనం. ఒక్క మాయావతి రక్షణకు ముఖ్యమంత్రిగా వున్న సమయంలో 300 మంది పోలీసులను వినియోగించారట. దాన్నిబట్టి దేశం మొత్తం మీద ఎంత మంది పోలీసుల శక్తి, సమయం, శిక్షణ ఎంతగా వృధా అయిపోతున్నదీ అర్థం చేసుకోవచ్చు.

మరొక రకం నేతలున్నారు. వీరికి ప్రభుత్వ విధానాలతో ఎటువంటి సంబంధం వుండదు. ప్రజల నుంచి, తీవ్రవాదుల నుంచి ప్రాణహాని దండిగా వుంటుంది. ముప్పాతిక భాగం ఎమ్పీలు, ఎమ్మెల్యేలు, మాజీ ఎమ్పీలు ఈ కోవకు చెందినవారే. వీరికి పోలీసు సెక్యూరిటీ అనేది ఒక స్టేటస్ సింబల్. ప్రజల వద్దకు వెళ్లినప్పుడు, వాహనాలలో ప్రయాణిస్తున్నప్పుడు ఎంత మంది పోలీసులు వారి చుట్టూ వుంటే అంత గొప్పగా భావిస్తారు. వారి అహంకారాన్ని సంతృప్తి పరచడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వేలాది మంది పోలీసులను వృధా చేస్తున్నాయి. ఈ దుష్ట సాంప్రదాయాన్ని నివారించడానికి కేంద్ర ఆర్థికమంత్రి చిదంబరం తనకు సెక్యూరిటీ వద్దని ప్రభుత్వానికి లేఖ వ్రాశారు. అయితే ఆయన ఆదర్శాన్ని అనుసరించడానికి మరే నేతా సిద్ధంగా లేదు.

జమీన్‌రైతు

నేతల రక్షణకు వినియోగిస్తున్న పోలీసులను వెనక్కు పిలిపిస్తే దేశంలోని చాలా పోలీసు విభాగాలలో సిబ్బంది కొరత తీరిపోతుంది. కోట్లాది మంది ప్రజల మాన ప్రాణాలకు రక్షణ కల్పించే అవకాశం ఏర్పడుతుంది. దేశంలో శాంతిభద్రతల నిర్వహణ మరింత సమర్థవంతంగా అమలు చేసే అవకాశం కలుగుతుంది. కానీ ప్రజల కోసం పని చేస్తున్నామని చెప్పుకొనే ఏ నేత కూడా తమ రక్షణ నియంత్రించుకొనేందుకు అంగీకరించదు. మన ప్రజా ప్రతినిధులకు ప్రజల మీద వున్న ప్రేమ అంత గొప్పదన్న మాట.

## జనవాణి

### యువత ఎటుపోతోంది!

ఇంటర్నెట్, ఫేస్‌బుక్‌ల వైపు యువత వేలం వెర్రిగా ఆకర్షింపబడుతున్నారు. ఫేస్‌బుక్‌లో తమ ఫోటోతోపాటు వ్యక్తిగత సమాచారం గూడ పొందుపరుస్తున్నారు. ఇటీవల ఒక యువతి ఫేస్‌బుక్‌లో ఓ అబ్బాయి ఫోటో చూసి చాటింగ్ ద్వారా అతనికి బాగా దగ్గరయ్యింది. అతను తాను కష్టాల్లో ఉన్నానని తెలియజేయగా అమ్మాయి తన అకౌంట్‌లో ఉన్నడబ్బు మొత్తం ట్రాన్స్‌ఫర్ చేసిందట. ప్రత్యక్షంగా చూసుకోగా అతను మరగుజ్జు అని తేలిందట. ఇంకొక అమ్మాయి పెళ్లి సమయంలో నెత్తిపై జిలకర పెట్టబోతుండగా అబ్బాయి విగ్ ఊడిపోయిందట. సమాచార విస్ఫోటనం కొన్నిసార్లు మేలు చేస్తుండవచ్చు. పెళ్లిళ్లు, స్నేహం, సహకారం వంటి విషయాల్లో యువతీ యువకులు స్వయంగా అన్ని వ్యవహారాలు తెలుసుకొని ముందడుగు వేస్తే బాగుంటుంది.

ఎస్వీఎస్ కోటేశ్వరరావు నెల్లూరు

### రైల్వే ఛార్జీల పెంపు ప్రతిపాదన విరమించాలి!

దేశ రైల్వేశాఖామంత్రిగా పవన్‌కుమార్ బన్సాల్‌గారు ఇటీవల పదవీ బాధ్యతలు స్వీకరించారు. ఆయన రైల్వేఛార్జీలను పెంచడమే తన తక్షణ కర్తవ్యమని ప్రకటించారు. మన రాష్ట్రంలో ఇటీవల పెరిగిన ఆర్టీసి ఛార్జీల వల్ల నిత్యావసర వస్తువుల ధరలు ఇప్పటికే ఆకాశాన్ని అంటాయి. ఈ నేపథ్యంలో రైల్వే ఛార్జీల పెంపు సామాన్య ప్రజలను ఆర్థికంగా మరింత ఇబ్బందులపాలు చేస్తుంది. ప్రజల ఆదాయాల్లో అధికభాగం తమ ప్రయాణాలకే ఖర్చయ్యే పరిస్థితి ఏర్పడుతుంది. రైల్వే ఆధునీకరణకు, విస్తరణకు, పటిష్టమైన భద్రతా చర్యలకు రైల్వే శాఖకు నిధులు అవసరమే, దీనికిగాను నిరుపయోగంగా ఉన్న రైల్వే భూములను వాణిజ్య సరళిలో నిర్వహిస్తే వేలకోట్ల రూపాయల నిధులొస్తాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సంక్షేమ, శ్రేయో రాజ్యపాలనా దృష్టితో ఆలోచించి అశేష ప్రజల క్షేమాన్ని దృష్టిలో ఉంచుకొని రైల్వేఛార్జీల పెంపు ఆలోచనను తక్షణం విరమించుకోవాలని సవినయంగా మనవి చేస్తున్నాను.

డాక్టర్ బి.కృష్ణమూర్తి నెల్లూరు

### మొక్కలు విరివిగా పెంచాలి!

సంవత్సరంలో 365 రోజులకు నేడు ఏదో ఒక ప్రాధాన్యత కల్పించి ప్రత్యేక 'డే'ల రూపంలో జరుపుకొంటున్నారు. వీటిల్లో మొక్కలు నాటే రోజును కూడా ప్రకటించాలి. అలాగే పుట్టిన రోజు కానుకలుగా మొక్కలు ఇచ్చే రోజు రావాలి. ప్రతి ఇంట్లో అరటి, బాదం, గోరింట, తమలపాకు, మందార, నంది వర్ధనం, పారిజాతం, కస్తూరి వంటి మొక్కలుండాలి. వీటిలో కొన్నైనా పెంచాలి. బాదం ఆకులో అల్పాహారం, అరిటాకులో భోజనం, తాంబూల సేవనం, ఫల పుష్ప నివేదనలు మన సంప్రదాయం. ఈ రకంగా యువతలో 'వృక్షోరక్షతి –

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

1-1-1943
పేజీలు : 8 వెల: 0-1-6

### పత్రికల హర్తాల్

రాజీకి భిన్నంగా కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు పత్రికలపై నూతన నిర్బంధాలు ప్రయోగించిన దానికి అసమ్మతి సూచకంగా ఈ నెల 6వ తేదీన అన్ని పత్రికల ప్రచురణను ఆపివేయాలని నిర్ణయించబడింది. నిర్బంధాలు తొలుగు వరకు ప్రభుత్వ ప్రకటనలు, ప్రభుత్వ సభ్యుల ఉపన్యాసాలు గూడా ప్రచురింపకూడదని నిర్ణయించారు. కొత్త సంవత్సర బిరుదాలు గూడా వేయకూడదన్నారు అఖిల భారత పత్రికా సంపాదకస్థాయి సంఘం.

### నెల్లూరు టవున్‌లో కలరా

21వ తేది నుండి 29వ తేది వరకు టౌన్‌లో కలరాకు 10 మంది మరణించారు. వీరిలో టౌన్‌వారు ఆరుగురు. బయటవారు నలుగురు.

ఎన్నిమార్లు తిరిగినా జిల్లా హెల్తు ఆఫీసరు వారు కలరా రిపోర్టు యివ్వడం లేదు. జిల్లా హెల్తు ఆఫీసరు గారు కలరా రిపోర్టు ప్రతివారం ప్రకటనార్థం పంపవలసినదిగా కోరుతున్నాము.

### భక్త పోతన

భక్త పోతన 7వ తేది రిలీజు కాబోతున్నది. ఈ దౌర్భాగ్య దినాల్లో గూడా వాహిని వారు కళా కాంతులనీను వాల్‌పోస్టర్ ప్రత్యేకతను జాపుచు నూత్న శోభను కల్పిస్తున్నది.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

28-12-1962
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### మన రాజకీయాలు
### ఆచార్య రంగా అనుచితవాదం

సరిహద్దు సమర సందర్భంలో ప్రజలను ప్రబోధిస్తూ ప్రధాని నెహ్రూ చిత్రంతో పోస్టర్లు వేయడాన్ని స్వతంత్ర పార్టీ నాయకుడు ఆచార్య రంగా ఆక్షేపించడం వింతగానూ, విపరీతంగానూ ఉన్నది.

నెహ్రూ భారత ప్రధాని. కేవలం పార్లమెంటులోని కాంగ్రెస్ బలాన్నిబట్టి అధికారంలోనికి వచ్చిన వ్యక్తి గాదు ఆయన. ఏ నాయకునికీ లేని బలము, పట్టు భారత ప్రజలలో నెహ్రూకున్నది. ప్రజలను ఉత్తేజపరచుటకు నెహ్రూ పేరు తారకమంత్రంగా ఉంటుంది. అందువల్ల నెహ్రూ ప్రధానే గాదు ప్రజానాయకుడు గూడా. అలాంటప్పుడు ప్రజాప్రబోధానికి నెహ్రూ బొమ్మగాక రంగాగారు ఇంకెవరి చిత్రం వేయమంటారో అర్థం కాదు.

### ముఖ్యమంత్రి వైరాగ్యం

ఆంధ్ర శాసన మండలిలో ఒక సభ్యుడు ముఖ్యమంత్రి సంజీవరెడ్డి గారిని కేంద్ర రక్షణ మంత్రిగా తీసుకుని ఉండవలసిందని వెలిబుచ్చగా "హైదరాబాద్‌లో మీకు యిష్టం లేకుంటే మా వూరికైనా పోతానుగానీ, ఢిల్లీకి వెళ్లను" అని వారు స్పష్టంగా చెప్పారు.

"నేను ఢిల్లీలో సరిపోతాననుకోను. నేను మంచి రాజకీయవాదిగా పరిగణింపడం లేదు. ఉన్నదున్నట్లు మాట్లాడుతాను. అందువల్ల నా పార్టీ వారికి గూడా నేను గిట్టను. నాకు ఢిల్లీ వాతావరణం సరిపడలేదు".

ఢిల్లీ పట్ల అంటే కాంగ్రెస్ నాయకత్వం పట్ల అంటే నెహ్రూ పట్ల(?) సంజీవరెడ్డి గారికి అంత తొందరలో అంత విముఖత ఎందుకు కలిగిందో ఆశ్చర్యమే అయినా వారికి ఢిల్లీ సరిపడలేదనే విషయం మాత్రం క్రొత్తకాదు.

# నెల్లూరు ముచ్చట్లు
[illegible]

## విద్యుత్ ఫిర్యాదుల ఫోను ఎత్తరేమి?

వేలవేలకు విద్యుత్ బిల్లుల రూపంలో వసూలు చేస్తున్న ట్రాన్స్‌కో సేవల పరంగా ప్రజలకు ఏమీ చేయడం లేదనే అనాలి. గతంలో ఎక్కడైనా విద్యుత్ సరఫరాలో అంతరాయం ఏర్పడితే 155333 నెంబరుకు ఫోన్‌చేస్తే వెంటనే సమస్య పరిష్కరించే వారు. ట్రాన్స్‌కో కార్యాలయంలోని ఫిర్యాదుల విభాగంలో 155333 నెంబరుతో నాలుగు ఫోన్లు పనిచేసేవి. ప్రస్తుతం ఇక్కడ ఒకే ఫోను పని చేస్తుంది. జిల్లా అంతటికీ ఇదే ఫిర్యాదు విభాగం కావడంతో ఎప్పుడూ బిజీగానే ఉంటుంది. ఒకవేళ లైనులో మనిషి దొరికినా సమస్య పరిష్కారానికి వేరే నెంబర్లు చెప్పి తప్పించుకుంటున్నారు. మరీ ఇంత అధ్వాన్నంగా వినియోగదారుల విభాగాన్ని తయారు చేస్తే ఎలా నందకుమార్‌గారూ!

## రోడ్లపై మట్టి!

నెల్లూరులోని ట్రంకురోడ్డుతో సహా ఇతర ముఖ్య రోడ్లపై మట్టి పేరుకుపోయి ఉంది. దీన్ని కార్పొరేషన్ పారిశుద్ధ్య సిబ్బంది తొలగించక పోవడంతో ద్విచక్ర వాహనదారులు నానాపాట్లు పడుతున్నారు. గాలి కొట్టినప్పుడు ఈ మట్టి వాహానదారుల కళ్లలో పడి ఇబ్బందులు పడుతున్నారు. రోడ్లో మట్టి కూడా ఎత్తించలేనంత బిజీ ఏమో మన కార్పొరేషన్ శానిటరీ ఇన్స్‌పెక్టర్లు.

## గాలిపటాల పండుగకు వివేకా?

అనారోగ్యం కారణంగా హైదరాబాద్‌లో విశ్రాంతి తీసుకుంటున్న నెల్లూరు రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి సంక్రాంతికి నెల్లూరు వస్తారని ఆయన ముఖ్య అనుచరులు చెబుతున్నారు. గాలిపటాల పండుగలో ఎమ్మెల్యే పాల్గొంటారట. ఆయన త్వరగా కోలుకోవాలని కోరుతూ 23వ తేది వివేకా 64వ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని అభిమానులు నగరమంతా ఫ్లెక్సీలను కట్టారు. పలుచోట్ల వస్త్ర, అన్నదానాలు చేశారు.

## వివాదాస్పద సమీక్ష

నెల్లూరు కార్పొరేషన్ మేయర్ ఛాంబర్‌లో ఇటీవల చోటా మోటా కాంగ్రెస్ నాయకులు చాట్ల నరసింహారావు, సన్నపురెడ్డి పెంచలరెడ్డి, బర్నాబాసు, పసుపులేటి శ్రీనివాసులు కమిషనర్‌తో నిర్వహించిన సమీక్షా సమావేశం చర్చనీయాంశమయ్యింది. సహజంగా కార్పొరేషన్‌లో జరుగుతున్న అభివృద్ధి పనులపై మేయర్ లేకుంటే కార్పొరేషన్ ప్రత్యేకాధికారి, కలెక్టర్, మంత్రిగానీ సమీక్షా సమావేశాలు నిర్వహించవచ్చు. ప్రస్తుతం మేయర్ లేరు కాబట్టి ప్రత్యేకాధికారికి మాత్రమే సమావేశాలు పెట్టే అర్హత ఉంది. కానీ కాంగ్రెస్ నాయకులు పెట్టిన సమావేశానికి కమిషనర్‌తోపాటు ఇతర మునిసిపల్ అధికారులు ఏవిధంగా హాజరయ్యారనే దానిపై జిల్లా కలెక్టర్ వివరణ అడిగి బాధ్యులపై తగిన చర్యలు తీసుకోవాల్సి ఉంది.

## విజయా నుంచి డిశ్చార్జి అయిన అరుణమ్మ!

కాలు మడతపడి చెన్నైలోని విజయా హెల్త్ సెంటర్‌లో చేరిన జిల్లా మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు పందిళ్ల పల్లి అరుణమ్మ ఈ వారంలో డిశ్చార్జ్ అయ్యి బాలాజీనగర్‌లోని తన స్వగృహంలో విశ్రాంతి తీసుకొంటున్నారు. చెన్నై సెంట్రల్ స్టేషన్‌లో ట్రైన్ కోసం వేచి ఉండగా రద్దీలో ఆమె కాలు మడత పడింది.

## త్వరలో స్థానిక సంస్థల ఎన్నికలు!

న్యాయపరమైన చిక్కులు, కోర్టు గొడవలు తీరగానే స్థానిక సమస్యల ఎన్నికలు పెడతామని ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి స్పష్టం చేశారు. నెల్లూరులో విలేకరులతో మాట్లాడుతూ స్థానిక సంస్థలకు కేంద్రం నుంచి రావాల్సిన రెండు వేల కోట్ల రూపాయల నిధులను కూడా రాబడతామన్నారు. సహకార ఎన్నికలను అక్రమంగా జరపాల్సిన అవసరం ప్రభుత్వానికి లేదని, ఈ ఎన్నికలు పార్టీ రహితంగా జరుగుతున్న విషయాన్ని విపక్షాలు గమనించాలన్నారు. జిల్లాలో ముందుగా ప్రకటించినట్లు కాకుండా మరో 75వేల ఎకరాలకు అదనంగా సాగునీటిని అందిస్తామని మంత్రి స్పష్టం చేశారు.

## వెంకయ్యనాయుడా? మజాకానా??

బిజెపి జాతీయ నాయకుడు వెంకయ్యనాయుడు మాటల మాంత్రికుడే కాదు ఆయనకు జ్ఞాపకశక్తి కూడా ఎక్కువని వెల్లడయ్యింది. 23వ తేది సాయంత్రం నెల్లూరు రిత్విక్ ఎన్‌క్లేవ్‌లోని వెంకయ్యనాయుడు స్వగృహంలో విలేకరుల సమావేశం ఏర్పాటు చేశారు. ఢిల్లీలో యువతిపై జరిగిన అత్యాచార ఘటనను తనదైన రీతిలో తీవ్రంగా ఖండించారాయన. మీడియా సమావేశం ముగిశాక దీనికిరాని విలేకరుల గుర్చి పేరు పేరునా ఆరాతీశారాయన. ముఖ్య విషయమై నొక్కి మాట్లాడుతూనే తన ప్రెస్‌మీట్‌కు రాని విలేకరులను వెంకయ్య పసికట్టిన విధానం మీడియాను, అక్కడున్న బిజెపి నేతలను ఆశ్చర్యపోయేలా చేసింది.

## నెల్లూరులో హైకోర్టు న్యాయమూర్తి!

హైకోర్టు న్యాయమూర్తి, జిల్లా పోర్ట్‌ఫోలియో జడ్జి కూడా అయిన నూతి రామ్మోహన్ 21వ తేది నెల్లూరు వచ్చారు. ప్రత్యేక రైల్వే మెజిస్ట్రేట్ కోర్టు ప్రాంగణంలో జ్యుడిషియల్ సర్వీసు సెంటర్‌ను ప్రారంభించారు. సాయంత్రం వెంకటగిరి జూనియర్ సివిల్ జడ్జి కోర్టులో ఏర్పాటుచేసిన కార్యక్రమంలో ఆయన పాల్గొని 150 ఏళ్ల చరిత్ర ఉన్న కోర్టు భవనాలను చూసి ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశారు.

## చెరుకు రైతుల బకాయిలు చెల్లిస్తాం!

కోవూరు షుగర్ ఫ్యాక్టరీ చెరుకు రైతులకు చెల్లించాల్సిన 11.5 కోట్ల రూపాయల బకాయిలను వచ్చే నెల చెల్లించేందుకు చర్యలు తీసుకొంటున్నామని ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి చెప్పారు. రాష్ట్రంలోని ఆరు సహకార చక్కెర కర్మాగారాల్లో సైతం ఇదేవిధంగా బకాయిలు పేరుకుపోయి ఉన్న తరుణంలో ముఖ్యమంత్రితో మాట్లాడి ఈ సమస్య పరిష్కారానికి ప్రయత్నం చేస్తున్నట్లు చెప్పుకొచ్చారు. కోవూరు షుగర్ ఫ్యాక్టరీ అంత బకాయి మరో ఫ్యాక్టరీ పడలేదని ఒక ప్రశ్నకు సమాధానంగా చెప్పారు.

## ఆక్వా రైతులకు 16 గంటల విద్యుత్!

రొయ్యల రైతులకు 16 గంటలపాటు విద్యుత్ సరఫరా చేయకుంటే సమస్యల సుడిగుండంలో చిక్కుకొంటారని కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు, ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి దృష్టికి తీసుకెళ్లారు. 20వ తేది జిల్లా రొయ్యల రైతు సంఘం నేతలతో కలసి హైదరాబాద్‌లో ముఖ్యమంత్రిని కలిశారాయన.

## వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి సాయం!

అన్నార్తులను, అభాగ్యులను ఆదుకోవడంలో అందెవేసిన వ్యక్తిగా పేరుగడించిన పారిశ్రామికవేత్త వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి మరోసారి తనలోని దానగుణాన్ని చాటారు. లివర్ వ్యాధితో బాధపడుతున్న జగదేవిపేట మండల పరిషత్ ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయునిగా విధులు నిర్వహిస్తున్న ఎ.రమణయ్య శస్త్ర చికిత్స నిమిత్తం లక్ష రూపాయల నగదును 23వ తేది తన చేతులమీదుగా అందించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ఆపదలో ఉన్న వారిని ఆదుకోవడంలో ఉన్న ఆత్మసంతృప్తి దేనిలోనూ ఉండదంటూ బాధితుడు రమణయ్య శస్త్రచికిత్స విజయవంతమై సంపూర్ణ ఆయురారోగ్యాలతో తిరిగి రావాలని ఆకాంక్షించారు.

## వీఆర్ఓల సంఘ నేతగా నెల్లూరీయుడు!



గ్రామ రెవిన్యూ అధికార్ల సంఘం రాష్ట్ర అధ్యక్షునిగా నెల్లూరు వీఆర్ఓ అశోక్‌రెడ్డి ఎన్నికయ్యారు. మచిలీపట్నంలో జరిగిన సంఘం రాష్ట్ర కార్యవర్గ సమావేశంలో ఈ ఎన్నిక జరిగింది. అశోక్‌రెడ్డి ప్రస్తుతం నెల్లూరు జిల్లా గ్రామ రెవిన్యూ అధికార్ల సంఘం అధ్యక్షునిగా వ్యవహరిస్తున్నారు. సహజంగా వీఆర్ఓలు పట్టపగ్గాల్లేకుండా వ్యవహరిస్తుంటారు. అశోక్‌రెడ్డి దీనికి పూర్తిగా విరుద్ధం. పది మందికి చేతనైన సహాయం చేయాలనే తత్వం ఆయనది. రాష్ట్ర అధ్యక్షునిగా ఆయన రాణించి నెల్లూరుకు పేరు తేవాలని ఆకాంక్షిస్తున్నాం.

## ఆర్టీసి ఆర్ఎం బదలీ

నెల్లూరు ఆర్టీసి రీజియన్ మేనేజర్ కొమరయ్యను హైదరాబాద్‌లోని బస్ భవన్‌కు బదలీ చేశారు. ఏలూరు ఆర్టీసి రీజియన్ మేనేజర్‌గా పనిచేస్తున్న రవికుమార్‌ను ఇక్కడ నియమించారు. అయితే శబరిమల యాత్ర సర్వీసులను నడపడంలో దిట్టయిన కొమరయ్యను జనవరి 10వ తేది తర్వాత రిలీవయ్యి హైదరాబాద్‌కు రమ్మని ఆయన బదలీ ఉత్తర్వుల్లో అధికారులు పేర్కొనడం విశేషం.

## మచ్చుకాయల రవికి డాక్టరేట్

నెల్లూరీయుడు, వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో భౌతిక శాస్త్ర విభాగంలో పరిశోధక విద్యార్థి మచ్చుకాయల రవికి యూనివర్సిటీ డాక్టరేట్ ప్రదానం చేసింది. పాలియర్ ఎలక్ట్రోలైట్స్ ఫర్ సాలిడ్ స్టేట్ బ్యాటరీ అప్లికేషన్ అనే అంశంపై రవి చేసిన పరిశోధనకుగాను ఈ డాక్టరేట్ లభించింది. రవికి పరిశోధనకు ఎస్వీయూనివర్శిటీలోని ఫిజిక్స్ డిపార్ట్‌మెంట్‌లోని సీనియర్ ప్రొఫెసర్ పి.వి.ఆర్.నరసింహారావు ఆద్యంతం పర్యవేక్షించారు. రవి స్వగ్రామం కోట మండలంలోని సూరిశెట్టిపాళెం.

## జగన్‌కోసం కోటి సంతకాలు!

వైఎస్ జగన్మోహన్‌రెడ్డిని జైలు నుండి విడుదల చేయాలని కోరుతూ వైకాపా నగర నియోజకవర్గ ఇన్‌ఛార్జ్ డాక్టర్ పి.అనిల్‌కుమార్ యాదవ్ 24వ తేది గాంధీబొమ్మ వద్ద 'జగ

కొరవ 14వ పేజీలో

● నత్తనడకను గుర్తుచేస్తున్న

# అదనపు తరగతుల నిర్మాణం!

జిల్లాలోని ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలల్లో రాజీవ్ విద్యామిషన్ నిధులతో చేపట్టిన అదనపు తరగతి గదులు, మరుగుదొడ్ల నిర్మాణాలు నత్తనడకన సాగుతున్నాయి. ఈ ఏడాది మార్చి నాటికే నిర్మాణాలు పూర్తికావలసి ఉన్నా ఇంకా కొనసాగుతూనే ఉండడంతో విద్యార్థులు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. జిల్లావ్యాప్తంగా 3570 ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలల్లో దాదాపు 1000కి పైగా అదనపు గదులను నిర్మించేందుకు గత ఏడాది ప్రభుత్వం నిధులు మంజూరు చేసింది. ఒక్కో గదికి ఐదు లక్షల రూపాయలు లెక్కన వీటిని మంజూరు చేశారు. వెయ్యి మరుగుదొడ్ల నిర్మాణానికి ఒక్కో దానికి 35వేల రూపాయల వంతున మంజూరు చేశారు. గత జూలై మాసంలో ఈ నిధులను విడుదల చేసి 2012 సంవత్సరం మార్చి లోపల పూర్తి చేయాలని ఆదేశించినప్పటికీ అనేక ప్రాంతాల్లో ఈ నిర్మాణాలు పూర్తికాలేదు. అదనపు గదుల నిర్మాణం పూర్తికాకపోవడంతోపాటు మరుగుదొడ్ల నిర్మాణాలు ఆలస్యంగానే జరుగుతున్నాయి. సర్వోన్నత న్యాయస్థానం సైతం విద్యార్థుల సౌకర్యాన్ని దృష్టిలో ఉంచుకొని 2012 డిసెంబర్ నాటికి మరుగుదొడ్లను పూర్తి చేయాలని ఆదేశించింది. అయినప్పటికీ ఈ నిర్మాణాలన్నీ పూర్తికాలేదు. దీంతో పలు పాఠశాలల్లో మరుగుదొడ్లులేక, తరగతి గదులు చాలక విద్యార్థులు పలు ఇబ్బందులు పడాల్సి వస్తోంది. ఉదయగిరి, ఆత్మకూరు, రాపూరు, వెంకటగిరి తదితర ప్రాంతాల్లో నిర్మాణ పనులు ఆలస్యంగా జరుగుతున్నాయి. దీనిపై జిల్లా కలెక్టర్ పలు సమావేశాలు నిర్వహించి త్వరితగతిన అదనపు గదులు, మరుగుదొడ్ల నిర్మాణం పూర్తి చేయాలని ఆదేశాలు జారీచేసినా అధికారుల అలసత్వం కారణంగా నత్తనడకన సాగుతున్నాయి. వచ్చే ఏడాది పాఠశాలలు పునఃప్రారంభమయ్యే నాటికైనా పూర్తవుతాయా? లేదా? అని విద్యార్థుల తల్లితండ్రులు అనుమానిస్తున్నారు.

## ఆందోళనకు గురిచేసిన యుగాంతం పుకారు!

డిసెంబర్ 21న యుగాంతం అని జరిగిన ప్రచారంలో ఎంత మాత్రం నిజం లేకపోయినా ప్రజల్లో ఒకరకమైన మానసిక సంఘర్షణను, భయాన్ని కలుగజేసింది. కొందరు చేసిన ప్రచారం అధిక సంఖ్యాకుల్లో భయాందోళనను రేకెత్తించింది. ప్రసార మాధ్యమాల్లో దీనిపై చర్చా కార్యక్రమాలు నిర్వహించడం, పలువురు పలు రకాల అభిప్రాయాలు వ్యక్తం చేయడంతో రెండు, మూడు రోజుల ముందు నుంచే చాలా మందిలో అనుమానం, భయం కలగలసి ఒత్తిడికి గురయ్యారు. యుగాంతం అనేది అభూత కల్పన అని, అలాంటివేమీ జరగవని నాసా, ఇస్రో శాస్త్రవేత్తలు, జ్యోతిష నిపుణులు, ఇతర ప్రముఖులతో దీని గురించి వివరణలు ఇప్పించినా, ముఖాముఖి ఫోన్‌లో మాట్లాడించినా ఉపయోగం లేకుండా పోయింది. టీవీ ఛానళ్ల అదే పనిగా యుగాంతం సినిమా గురించి, యుగాంతంపై జరుగుతున్న ప్రచారం గురించి ఊదరగొట్టడంతో ప్రజల్లో నెలకొని ఉన్న భయాన్ని, ఆందోళనను తొలగించడం మాట అటుంచితే వీటిని మరింత పెంచినట్లయ్యింది. వేరు వేరు ప్రాంతాల్లో ఉద్యోగం చేసుకొంటున్న భార్యాభర్తలు, కుటుంబ సభ్యులు ఈ ప్రచారంలో ఎంత మాత్రం నిజం లేకపోయినా కొంత తల్లడిల్లారు. నగరంలో పలువురు డిసెంబర్ 21వ తేదీన బయటకు వెళ్లకుండా ఇంట్లోనే ఉండడం, పిల్లలను పాఠశాలలకు పంపించకుండా చేశారు. వీటిని పరిశీలిస్తే తెలియకుండానే అధిక సంఖ్యాకులు యుగాంతం జరుగుతుందనే పుకారు పట్ల ఆందోళన చెందారనే చెప్పొచ్చు.

# సాగునీరు ఇవ్వకుంటే ఉద్యమిస్తాం!

## కావలిలో జరిగిన అఖిలపక్ష సమావేశంలో తేల్చి చెప్పిన బీద



రైతులకు నీటి సరఫరా జరిగేలా చూడాలని ఇందుకోసం నిరాహార దీక్ష చేసేందుకైనా సిద్ధమని కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు ప్రకటించారు. ఇటీవల కావలి సోమశిల కార్యాలయంలో సాగునీటి సరఫరాపై అఖిలపక్షం సమావేశం జరిగింది. ఈ సందర్భంగా అధికారులు రైతులకు పంటల సాగుకు అవసరమైన నీటిని అందజేయలేమని చేతులెత్తేయడంతో సమావేశంలో గందరగోళం నెలకొనింది. అధికారులపై ఎమ్మెల్యే తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశారు. ఐఏబి సమావేశంలో తీసుకున్న నిర్ణయం మేరకు రైతులకు నీరు అందించాల్సి వుండగా ఎందుకు ఇవ్వలేకపోతున్నారని సూటిగా ప్రశ్నించారు. వరద నీరు వచ్చినప్పుడు సోమశిల నీటితో చెరువులు నింపివుంటే ఈ సమస్య వచ్చేది కాదన్నారు. రైతుల పరిస్థితి దారుణంగా వుందని, ఒక్క పంటకైనా నీరు ఇవ్వకపోతే ఆత్మహత్యలే శరణ్యమన్నారు. గతంలో టిడిపి హయాంలో రెండు టిఎంసిల డెడ్ స్టోరేజ్‌తో పంటలకు నీరిచ్చినపుడు ఇప్పుడు ఎందుకు ఇవ్వలేకపోతున్నారో చెప్పాలని అధికారులను నిలదీశారు. దీనికి అధికారులు సమాధానం చెప్పలేక గందరగోళానికి గురయ్యారు. దీనిపై సోమశిల ప్రాజెక్టు కెనాల్ అధ్యక్షుడు మధుబాబు నాయుడు మాట్లాడుతూ తొందరపడి రైతులు వరిసాగు చేపట్టారని, పరిస్థితులు ఇలా వస్తాయని ఎవరికి తెలుసన్నారు. వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ మండల నేత చింతం బాబురెడ్డి మాట్లాడుతూ వేసిన పంటలకు నీరు సరఫరా చేయాల్సిందేనన్నారు. నేతలు రైతుల పక్షాన మాట్లాడినా, అధికారులు మాత్రం నీరు అందివ్వలేమని ఖరాఖండిగా చెప్పేయడంతో రైతాంగం ఆందోళన చెందుతోంది.



నెల్లూరు మాగుంట లేఅవుట్‌లోని వేదవ్యాస హైస్కూల్‌లో గణిత శాస్త్రవేత్త శ్రీనివాస రామానుజన్ జన్మదినం సందర్భంగా మ్యాథ్స్ వర్క్ ఫెస్ట్‌లో పాల్గొన్న విద్యార్థులు.




హైదరాబాద్‌లోని ఫిలిం ఛాంబర్ కార్యాలయంలో నెల్లూరీయుడు కె.మురళీమోహన్ రాజు దర్శకత్వం వహించిన ఇశ్రాయేల్ దేవుని ఆజ్ఞలు చిత్రం ఆడియో సిడిని ఆవిష్కరిస్తున్న సినీ హీరో ఆకాష్.

• క్వారీల లీజులు

# రద్దు చేయాలి!

## గూడూరు, వెంకటగిరి ఎమ్మెల్యేల సలహా!





ప్రజలకు ఇబ్బంది కల్గించే క్వారీ గనులను రద్దు చేయాలని వెంకటగిరి, గూడూరు శాసనసభ్యులు కురుగొండ్ల రామకృష్ణ, బల్లి దుర్గాప్రసాద్ డిమాండ్ చేశారు. క్వారీల కారణంగా గూడూరు డివిజన్‌లో వివిధ ప్రాంతాల్లోని ప్రజలు ఇబ్బందులు పడుతున్న విషయమై స్పందించిన వారు బాలాయపల్లి మండలం అలిమిలి ప్రాంతంలో పర్యటించారు. ఇక్కడి క్వారీ గనులను పరిశీలించిన అనంతరం వారు స్థానికులతో మాట్లాడారు. గ్రామాల మధ్య క్వారీల ఏర్పాటుకు అనుమతివ్వడంపై ఆశ్చర్యం వ్యక్తం చేసిన ఎమ్మెల్యేలు ఈ విషయమై అధికారులను ప్రశ్నించారు. ఈ సందర్భంగా గ్రామ ప్రజలు క్వారీల వలన తాము పడుతున్న బాధలను, ఎదుర్కొంటున్న ఇబ్బందులను శాసనసభ్యుల దృష్టికి తీసుకొని వచ్చారు. బ్లాస్టింగ్ వల్ల ఇళ్లు పగుళ్లు ఇస్తున్నాయని, లారీలు అధికంగా తిరుగుతుండడం వల్ల రోడ్లు ధ్వంసమై దుమ్ము, ధూళితో ఈ ప్రాంతం నిండిపోతోందని తెలిపారు. బాలాయపల్లితోపాటు అలిమిలి, కుందాం, పల్లెపాడు, మన్నూరు గ్రామాల ప్రజలు తరలివచ్చి క్వారీల వలన ఎదుర్కొంటున్న సమస్యలను ఏకరవు పెట్టారు. దీనికి ఎమ్మెల్యేలు స్పందిస్తూ గ్రామాల మధ్య క్వారీల ఏర్పాటుకు అధికారులు అక్రమంగా అనుమతులివ్వడం, ప్రజల బాధలపై కలెక్టర్ దృష్టికి తీసుకొనిపోయి క్వారీలను రద్దుచేయిస్తామని హామీ ఇచ్చారు.

# సమాచార వ్యవస్థ కీలకం!

## గుంటూరు రేంజ్ పోలీసు కమ్యూనికేషన్ డిఎస్పీ

పోలీస్‌శాఖలో కమ్యూనికేషన్ వ్యవస్థకు విశేష ప్రాధాన్యత వుందని గుంటూరు రేంజ్ కమ్యూనికేషన్ డిఎస్పీ జె.రాజేశ్వరి తెలిపారు. ఇటీవల ఆమె వెంకటగిరి సర్కిల్ పరిధిలో కమ్యూనికేషన్ విధానాన్ని పరిశీలించడంతోపాటు రికార్డులను పరిశీలించారు. ప్రకృతి వైపరీత్యాల సమయంలో, విఐపిలు వచ్చినప్పుడు, ప్రజాప్రతినిధులు, వివిధ పార్టీల సభలు, సమావేశాలు సందర్భంలో కమ్యూనికేషన్ వ్యవస్థ ప్రాధాన్యం అధికంగా వుంటుందన్నారు. సిబ్బంది సమర్ధవంతంగా పని చేయాలన్నారు. కమ్యూనికేషన్ విభాగంలోనూ సాంకేతిక మార్పులు చోటు చేసుకొన్నాయని గతంలో సాధారణ కమ్యూనికేషన్ వ్యవస్థ వుండేదని, ఇప్పుడు బ్రాడ్ బ్యాండ్ ద్వారా సమాచారం క్షణాల్లో చేరిపోతున్నాదన్నారు. గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాల్లో కమ్యూనికేషన్ విభాగంలో సిబ్బంది కొరత వుందని, ఈ సమస్యను త్వరలో పరిష్కరించి సిబ్బందిని నియమించేందుకు ఉన్నతాధికారులు చర్యలు చేపడుతున్నారన్నారు.

# కౌలు రైతులకు రుణాలేవీ?

## బ్యాంకుల చుట్టూ తిరిగి కాళ్లరుగుతున్నాయి

అధికారులు కౌలు రైతులందరికి రుణాలు అందజేస్తున్నామని ప్రకటిస్తున్నప్పటికీ వాస్తవ పరిస్థితులు మాత్రం అందుకు విరుద్ధంగా వుంటున్నాయని పలువురు రైతులు వాపోతున్నారు. వెంకటగిరిలో పరిశీలించినట్లయితే ఈ విషయం తెలుస్తుంది. జిల్లా ఉన్నతాధికారుల ఆదేశాల మేరకు తహశీల్దార్ బ్యాంకు అధికారులతో సమావేశాలు నిర్వహించి కౌలు రైతులకు రుణాలు అందజేయాలని కోరినప్పటికీ ఫలితం లేకుండా పోతోందని కౌలు రైతులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. నిబంధనల పేరుతో బ్యాంకు అధికారులు రెండు నెలలుగా బ్యాంకుల చుట్టూ తిప్పుకోవడం, చివరకు మొండిచేయి చూపుతున్నారన్నారు. మండల పరిధిలోని కౌలు రైతుల్లో మొదటి విడతగా 642 మందిని ఎంపిక చేసి వీరికి బ్యాంకు రుణాలు ఇవ్వాలని నివేదిక పంపినా, సమావేశాలు నిర్వహించినా తహశీల్దార్, విఆర్‌ఓలు బ్యాంకు అధికారులను కలిసినా ప్రయోజనం లేకుండా పోయింది. పినాకిని గ్రామీణబ్యాంకు మాత్రం 1.20లక్షలు రుణాలుగా అందజేసింది తప్ప మిగతా బ్యాంకుల నుంచి స్పందన కరువవుతోంది. పలు రకాల సాకులు చెప్తూ బ్యాంకుల చుట్టూ తిప్పుకొంటుండడంతో రెవిన్యూ అధికారులు సైతం బ్యాంకు సిబ్బంది నిర్వాకానికి తలలు పట్టుకొంటున్నారు. దీనిపై ఉన్నతాధికారులకు నివేదిక ఇవ్వడం తప్ప తాము చేయగలిగింది ఏదీ లేదని చేతులెత్తేస్తున్నారు రెవెన్యూ అధికారులు.

# ఆత్మకూరులో వంద పడకల ఆస్పత్రి!

## ప్రతిపాదిత స్థలం పరిశీలించిన ఇంజనీరింగ్ అధికారులు

ఆత్మకూరులో 100 పడకల ఆస్పత్రి భవనాన్ని 21 కోట్ల రూపాయలతో నిర్మించనున్నట్లు అధికారులు తెలిపారు. ఇటీవల ఆస్పత్రి నిర్మాణం కోసం కేటాయించిన స్థలాన్ని వైద్యఆరోగ్యశాఖ ఇంజనీరింగ్ అధికారులు పరిశీలించారు. స్థానిక అంకయ్య పెట్రోల్ బంక్ వద్ద గల ఈ స్థలంలో వంద పడకల ఆస్పత్రి నిర్మాణంపై కాంట్రాక్టర్‌తో చర్చించారు. ఈ సందర్భంగా ఈఈ అంకయ్య చౌదరి మాట్లాడుతూ ఆస్పత్రి నిర్మాణానికి 21.02కోట్లు మంజూరయ్యాయన్నారు. ఈ పనులను త్వరితగతంగా పూర్తి చేసేందుకు చర్యలు చేపడుతున్నామన్నారు. టెండర్ల ప్రక్రియ పూర్తయినందున త్వరలో పనులు ప్రారంభం అవుతాయని తెలిపారు. ఈ కార్యక్రమంలో వైద్యఆరోగ్యశాఖ ఇంజనీరింగ్ అధికారులు కుమార్‌రత్న, పార్థసారధి, ముకుందరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# కల్వర్టుల తొలగింపు

## తోటపల్లి, ఇస్కపల్లి రైతుల హర్షం

కొందరు తమ స్వార్థం కోసం అనధికారికంగా తోటపల్లిగూడూరు మండలంలో నిర్మించిన కల్వర్టును ఎట్టకేలకు అధికారులు తొలగించారు. దీంతో చాలా కాలంగా సాగునీరు అందక ఇబ్బంది పడుతున్న రైతాంగం హర్షం వ్యక్తం చేస్తోంది. మండల పరిధిలోగల మాచర్లవారి పాళెం పారుదల కాలువ నుంచి తోటపల్లికి నీరుపారే కాలువ వద్ద కొందరు రైతులు అధికారుల నుంచి ఎలాంటి అనుమతి లేకుండా అక్రమంగా కల్వర్టు నిర్మించారు. దీంతో ఈ కాలువ క్రింద తోటపల్లి, ఇస్కపాళెం పంచాయితీ పరిధిలో సాగవుతున్న షుమారు 500 ఎకరాలకు సాగునీటి సరఫరాకు అవరోధం ఏర్పడింది. తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్న రైతాంగం ఈ కల్వర్టు గురించి సాగునీటి వినియోగదారుల సంఘం అధ్యక్షుడు నాయుడు హేమంత్‌కుమార్‌రెడ్డి, అన్నం రవిచంద్రల ఆధ్వర్యంలో తహశీల్దార్ రేవతికి ఫిర్యాదు చేశారు. 50 ఎకరాలకు సాగునీరు పారుదల కోసం అనధికార కల్వర్టును నిర్మించారని, దీనిపై చర్యలు తీసుకోవాలని కోరారు. దీనిపై స్పందించిన తహశీల్దార్ నీటి పారుదల శాఖ అధికారులకు తెలపడంతో అధికారులు జెసిబి యంత్రాన్ని తీసుకొనివెళ్లి కల్వర్టును తొలగించారు. ఈ చర్యతో రైతులు హర్షం వ్యక్తం చేశారు. ఈ తొలగింపు కార్యక్రమంలో నీటిపారుదలశాఖ ఇంజనీరింగ్ అధికారి విజయభాస్కర్‌రెడ్డి, విఆర్‌ఓ శ్రీనివాసన్, సుదర్శన్ తదితరులు పాల్గొన్నారు.

# నీటి తీరువా వసూళ్లు సక్రమంగా చేయండి!

## కావలి ఆర్డీఓ ఆదేశం

రైతుల నుంచి నీటి తీరువా వసూలు చేయడంలో నిర్లక్ష్యం వహిస్తే శాఖాపరమైన చర్యలు తీసుకుంటామని కావలి ఆర్‌డిఓ సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డి హెచ్చరించారు. ఇటీవల ఆయన కోవూరు మండలంలో పర్యటించారు. ఈ సందర్భంగా స్థానిక రెవెన్యూ కార్యాలయంలో అధికారులతో సమీక్షించారు. రైతుల నుంచి నీటి తీరువా వసూళ్లు చేయడంలో గ్రామ రెవెన్యూ అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారని, ఇది మంచి పద్ధతి కాదన్నారు. డివిజన్ పరిధిలోని అన్ని మండలాల గ్రామ రెవెన్యూ అధికారులు నీటి తీరువా లక్ష్యాలను సకాలంలో వసూలు చేయాలని ఆదేశించారు. డివిజన్ పరిధిలో 40శాతం మాత్రమే ఈ వసూళ్లు వుండడం పట్ల తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేశారు. రైతులు రెవెన్యూశాఖకు సహకరించాలని, సకాలంలో శిస్తు చెల్లించాలన్నారు. అలాగే కావలి డివిజన్ పరిధిలో రుణ అర్హత కల్గిన కౌలు రైతులందరికీ రుణం అందించేలా బ్యాంకర్లు సహకరించాలన్నారు. ఇందుకోసం రెవెన్యూ అధికారులు ప్రత్యేక చొరవ చూపాలన్నారు. ఇప్పటివరకు డివిజన్ పరిధిలో 8,500 మంది కౌలు రైతులకు రుణ అర్హతా కార్డులు ఇచ్చామన్నారు. జాతీయ కుటుంబ సంక్షేమపథకం క్రింద 30లక్షల మేర నిధులు పంపిణీ చేశామన్నారు. ఈ సమావేశంలో కోవూరు తహశీల్దార్ సాయిబాబా, ఇతర అధికారులు పాల్గొన్నారు.

# దర్శి లక్ష్మీనరసయ్య సేవలు చిరస్మరణీయం!



● సంతాపసభలో వక్తల అభిభాషణ.

భారతీయ జనతాపార్టీకి దర్శి లక్ష్మీనరసయ్య చేసిన సేవలు చిరస్మరణీయమని ఆ పార్టీ నేతలు కొనియాడారు. పార్టీ పట్ల అంకిత భావం, నిబద్ధత పలువురికి ఆదర్శమని వక్తలు నివాళులు అర్పించారు. బిజెపి జిల్లా కార్య వర్గ సభ్యులుగా వుంటూ ఇటీవల మృతి చెందిన నరసయ్య సంతాపసభ బుచ్చిలో జరిగింది. స్థానిక దాచూరు సోమయ్య కళ్యాణ మండపంలో జరిగిన ఈ కార్యక్రమానికి బిజెపి జిల్లా అధ్యక్షుడు కర్నాటి ఆంజనేయరెడ్డి, అధికార ప్రతినిధి సన్నపు రెడ్డి సురేష్‌రెడ్డి, దువ్వూరు రాధాకృష్ణారెడ్డి తదితరులు పాల్గొని ప్రసంగించారు. జాతీయనేత వెంకయ్యనాయుడుతో సహా అందరితో సన్నిహితంగా మెలిగిన వ్యక్తి దర్శి అన్నారు. ఆయన మృతి పార్టీకి తీరని లోటని సంతాపం తెలిపారు. అనంతరం పేదలకు అన్నదాన కార్యక్రమాన్ని నిర్వహించారు. ఈ కార్యక్రమంలో శ్రీనివాసులు, గుర్రం నరసింహులు, వేమా సుబ్బారావు, దామిశెట్టిమోహన్ తదితరులు పాల్గొన్నారు.

# బీద సేవలు ప్రశంసనీయం!

విద్యా, వైద్యరంగాల్లో కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు చేస్తున్న కృషిని జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం ప్రశంసించారు. అల్లూరు మండలం ఇస్కపల్లిలో ఎమ్మెల్యే తన తండ్రి అయిన బీద రమణయ్య తొమ్మిదవ వర్ధంతిని పురస్కరించుకొని మెగా ఉచిత వైద్య శిబిరాన్ని ఏర్పాటు చేశారు. ఈ కార్యక్రమంలో పాల్గొన్న జాయింట్ కలెక్టర్ మాట్లాడుతూ పేదలకు అండదండలు అందించడంలో, సొంత నిధులు వెచ్చించి సేవా కార్యక్రమాలు నిర్వహించడంలో బీద మస్తాన్‌రావు పలువురికి ఆదర్శంగా నిలుస్తున్నాడని అభినందించారు. కావలి ఏరియా వైద్యశాల వారు ఏర్పాటు చేసిన రక్తదాన శిబిరాన్ని ప్రారంభించిన గూడూరు శాసనసభ్యుడు బల్లి దుర్గాప్రసాద్ మాట్లాడుతూ రక్తదాన, వైద్య శిబిరాలు ఏర్పాటు చేయడం శుభ పరిణామన్నారు. పేదల కోసం నిరంతరం తపించే వ్యక్తి బీద మస్తాన్‌రావు అని కొనియాడారు. ఎమ్మెల్యే మస్తాన్‌రావు మాట్లాడుతూ పేదలకు తనవంతు సహాయ సహకారాలు అందించడానికి ఎల్లవేళలా కృషి చేస్తానన్నారు. ఇలాంటి వైద్య శిబిరాలను ప్రజలందరూ వినియోగించుకోవాలని కోరారు. పలువురు వైద్యులు శిబిరంలో పాల్గొని రోగులను పరీక్షించి మందులను ఉచితంగా అందజేశారు. ఈ కార్యక్రమంలో యాదవ సంఘం అధ్యక్షులు దేవరాల సుబ్రహ్మణ్యం, తహశీల్దార్ శ్రీనివాసులరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

**ఇస్కపల్లిలో జాయింట్ కలెక్టర్**

# పెద్దపుత్తేడు పాఠశాల స్వర్ణోత్సవాలు!

**● ఘనంగా జరిగాయి**

కన్నతల్లిని, జన్మభూమిని, చదువు నేర్చుకొన్న పాఠశాలలను ఎన్నడూ మరువలేదని కావలి శాసన సభ్యుడు బీద మస్తాన్‌రావు తెలిపారు. దగదర్తి మండలం పెద్దపుత్తేడు పాఠశాల స్వర్ణోత్సవాలు ఇటీవల పూర్వవిద్యార్థుల ఆధ్వర్యంలో ఘనంగా జరిగాయి. ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా విచ్చేసిన ఆయన మాట్లాడుతూ గ్రామంలోని పాఠశాలలు వ్యక్తిత్వవృద్ధిలో కీలక పాత్ర పోషిస్తాయన్నారు. ఇక్కడ నేర్చుకొనే చదువు, క్రమశిక్షణ జీవితంలో ఎంతగానో ఉపయోగపడుతుందన్నారు. అప్పట్లో పంచాయితీ భవనంలో పాఠశాల నిర్వహింపబడేదన్నారు. అలాంటి పాఠశాలకు స్వర్ణోత్సవాలు జరపడం అభినందనీయమన్నారు. నెల్లూరు శాసనసభ్యుడు ముంగమూరు శ్రీధర్ కృష్ణారెడ్డి మాట్లాడుతూ మనం ఎంత సంపాదించామనేది ముఖ్యం కాదని, ఎంత జ్ఞానాన్ని సముపార్జించామనేది కీలకమన్నారు. ఈ సందర్భంగా ప్రధానోపాధ్యాయుడు జ్ఞానరత్నం, మెట్టు మదన్ మోహన్‌రెడ్డిని, తల్లిదండ్రుల పేరిట లక్ష రూపాయలు వెచ్చించి సభా వేదిక నిర్మించిన కొండవలూరు హెడ్ కానిస్టేబుల్ శింబోతు శ్రీనివాసులు, వెంకటరమణ, మహాదేవయ్యలను సన్మానించారు. ఈ కార్యక్రమంలో మాలెపాటి రవీంద్రనాయుడు, హరికిషోర్‌రెడ్డి, కావలి ఉపవిద్యాశాఖాధికారి మేరీ ఆరతి తదితరులు పాల్గొన్నారు.



# విద్యుత్ చౌర్యం, లోడ్‌లపై దాడులు!

**కలువాయిలో డిస్కం అధికారులు**

కలువాయి మండలంలో డిస్కం అధికారులు దాడులు నిర్వహించారు. విద్యుత్ చౌర్యం, అధికలోడ్ వినియోగంపై అధికారులు తనిఖీలు చేపట్టారు. మండలంలోని చిన్న పరిశ్రమలు, దుకాణాలు, గృహాలలో విద్యుత్ వాడకాన్ని, మీటర్ల పనితీరును పరిశీలించారు. అక్రమంగా విద్యుత్ వినియోగిస్తున్న 15మంది పై కేసులు నమోదు చేశారు. డిఇ అనిల్ కుమార్ ఆధ్వర్యంలో 48మంది సిబ్బంది బృందాలుగా విడిపోయి ఈ దాడులు జరపడం చర్చనీయాంశమయ్యింది.

# గీత కార్మికులకు బడ్జెట్ పెంచాలి!

**కోవూరులో సంఘం ప్రధాన కార్యదర్శి నరసింహమూర్తి**

కల్లుగీత వృత్తిని నేటి పరిస్థితులకు తగినట్లు ఆధునీకరించాలే తప్ప రద్దు చేయాలన్న ఆలోచనను ప్రభుత్వం విరమించుకోవాలని కల్లుగీత కార్మిక సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి జె.నరసింహమూర్తి డిమాండ్ చేశారు. కోవూరులో జరిగిన కల్లుగీత కార్మికుల జిల్లా మహాసభలలో ఆయన పాల్గొని ప్రసంగించారు. రాష్ట్రంలో 45 లక్షల మంది కల్లుగీతపై ఆధారపడి ఉపాధి పొందుతున్నారన్నారు. బహుళ జాతి సంస్థలకు లబ్ధి చేకూర్చేందుకు ప్రభుత్వం కల్లుగీత వృత్తిని రద్దు చేయాలని ప్రభుత్వం భావిస్తోందని విమర్శించారు. గీత కార్మికులు పలువురు ప్రమాదాలకు గురౌతున్నారని, మృత్యువాత పడ్డారని తెలిపారు. గీత వృత్తిలో మరణించిన వారి కుటుంబాలకు అందించే ఎక్స్‌గ్రేషియోను ఐదు లక్షల రూపాయలకు పెంచాలని, 50ఏళ్ల వయసు పైబడిన వారందరికి పింఛన్లు ఇవ్వాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. అలాగే జనాభా ప్రాతిపదికన కల్లుగీత కార్మికులందరికీ బడ్జెట్‌లో నిధులు కేటాయించాలన్నారు. అనంతరం నూతన కమిటీని ఎన్నుకొన్నారు. ఈ సమావేశంలో సుబ్బారావు, రమణయ్య, వెంకటేశ్వర్లు, సుబ్బరాయుడు, గోపాల్, వెంకటరమణయ్య తదితరులు పాల్గొన్నారు.

# వైద్య ఆరోగ్య సిబ్బందిలో మార్పు రావాలి!

**ముత్తుకూరులో కలెక్టర్**

ప్రభుత్వం ఎన్ని కార్యక్రమాలు చేపట్టినా వైద్య సిబ్బందిలో మార్పు రానంత వరకు వాటికి ప్రయోజనం వుండదని జిల్లా కలెక్టర్ శ్రీధర్ అభిప్రాయపడ్డారు. వైద్య ఆరోగ్యశాఖ ఆధ్వర్యంలో రూపొందించిన రావమ్మా మహలక్ష్మీ కార్యక్రమాన్ని సర్వేపల్లి నియోజకవర్గ పరిధిలోగల తోటపల్లి గూడూరు, ముత్తుకూరు, మనుబోలు, వెంకటాచలం, పొదలకూరు మండలాల్లో జరిగింది. ముత్తుకూరు, వెంకటాచలం మండలాల్లో ఈ కార్యక్రమంలో జిల్లా కలెక్టర్ శ్రీధర్ పాల్గొన్నారు. ఆరోగ్య సూత్రాలన్నీ అమలైతే జిల్లా సంపూర్ణ ఆరోగ్యంతో వుంటుందన్నారు. ప్రభుత్వం ఎంతచేసినా సిబ్బంది బాధ్యతాయుతంగా పని చేయకపోతే ఆ శ్రమ అంతా వృధా అవుతుందన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని సిబ్బంది ప్రజల మన్ననలు చూరగొనేలా పని చేయాలన్నారు. ఎప్పుడూ పాడు పడిపోయినట్లు వుంటూ, సిబ్బంది కన్పించని ఆరోగ్య కేంద్రాలు ఈ కార్యక్రమం పుణ్యమా అని ముగ్గులతో ముస్తాబయ్యాయి. ఈ కార్యక్రమానికి మద్యం సేవించి వచ్చిన ఓ వ్యక్తి నానా గొడవ చేయడంతో కలెక్టర్‌కు చిర్రెత్తుక వచ్చింది. కోడూరుకు చెందిన కావల్‌రెడ్డి రామకృష్ణారెడ్డి, చీరలు, రవికలు, గాజులు అందజేశారు. ఈ కార్యక్రమంలో వైద్యఆరోగ్య శాఖాధికారి డాక్టర్ మాసిలామణి ఇతర వైద్యాధికారులు పాల్గొన్నారు.

# ప్రత్యేకంగా జగన్ జన్మదినం!

## ● ఆకట్టుకొన్న పార్టీ పతాకం!



నెల్లూరులో పార్టీ పతాకంతో ప్రదర్శన.

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ సర్వాధినేత జగన్మోహన్‌రెడ్డి జన్మదినోత్సవ వేడుకలు 21వ తేది నెల్లూరులో ఘనంగా జరిగాయి. ఈ సందర్భంగా 300 మీటర్ల పార్టీ జెండాను పార్టీ కార్యకర్తలు చేబూని నగరంలో పెద్ద ప్రదర్శన నిర్వహించడం అందరినీ ఆకట్టుకొంది. ఈ సందర్భంగా కార్యకర్తలను ఉద్దేశించి పార్టీ జిల్లా కన్వీనర్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి మాట్లాడుతూ పార్టీ జెండాను మోసిన విధంగానే యువనేత జగన్‌ను ముఖ్యమంత్రినిచేసి తమ భుజాలపై ఆయన్ను తిప్పుతామన్నారు. రాజశేఖర్‌రెడ్డి బతికి ఉంటే మూడోసారి కూడా రాష్ట్ర ముఖ్యమంత్రి అయ్యేవారన్నారు. శ్రీధర్‌రెడ్డి మాట్లాడుతూ వైఎస్ఆర్ కుటుంబంపై ప్రజల్లో ఉన్న ప్రేమాభిమానాలు ఎవరూ దూరం చేయలేరన్నారు. డాక్టర్ పోలుబోయిన అనిల్ మాట్లాడుతూ జగన్నను రాష్ట్ర ముఖ్యమంత్రిగా చూడాలని ప్రజలంతా వేయి కళ్లతో ఎదురు చూస్తున్నా రన్నారు. ఈ కార్యక్రమంలో ముక్కాల ద్వారకానాథ్, రూప్‌కుమార్ యాదవ్, తాటి వెంకటేశ్వర్లు, మందా బాబ్జి, సంక్రాంతి కళ్యాణ్ తదితరులు పాల్గొన్నారు.

# గుజరాత్‌లో విజయంపై నెల్లూరులో బిజెపి దడబడలు!

గుజరాత్‌లో నరేంద్రమోడి నాయకత్వంలో బిజెపి మూడోసారి విజయకేతనం ఎగుర వేయడంతో నెల్లూరులోని ఆ పార్టీ నేతలు ఆనందంలో మునిగి తేలారు. నగరంలో స్కూటర్ ర్యాలీ నిర్వహించారు. గాంధీబొమ్మ వద్ద ప్రజలకు స్వీట్లు పంచి పెట్టారు. మినీబైపాసురోడ్డులోని బిజెపి కార్యాలయం వద్ద బాణా సంచా కాల్చారు. 2014లో జరిగే పార్లమెంటు ఎన్నికలు బిజెపి కేంద్రంలో అధికారంలోకి వస్తుందన్నారు. గుజరాత్‌లో ఫలితాలు కాంగ్రెస్ పార్టీ పాలనకు చెంపపెట్టన్నారు. బిజెపి జిల్లా అధ్యక్షుడు కర్నాటి ఆంజనేయరెడ్డి, నెల్లూరు నగర అధ్యక్షుడు మండ్ల ఈశ్వరయ్య ఈ కార్యక్రమాలకు నేతృత్వం వహించారు.

## ఆపరేషన్‌కు చేయూతనివ్వండి!

### మునిసిపల్ మాజీ ఉద్యోగి వేడుకోలు

నెల్లూరు మునిసిపల్ రెవిన్యూ విభాగంలో 35 ఏళ్లపాటు దినసరి వేతనంతో అకౌంటెంట్‌గా పనిచేసిన దుర్గం వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి(62) మధుమేహంతో ఒక కంటి చూపు కోల్పోవడంతోపాటు ఈ వ్యాధి ముదిరి కాళ్ల మధ్య గడ్డలతో ఇబ్బంది పడుతున్నాడు. రెండు ఆపరేషన్లు చేయను లక్ష రూపాయలు ఖర్చవుతుందని తనకంత స్థోమత లేకపోవడం వల్ల దాతలు సాయపడమంటున్నాడు. వదాన్యులు డివిఎస్ శాస్త్రి, కేరాఫ్ రామకృష్ణ 18/219 శిఖరంవారి వీధి, నెల్లూరు –1 చిరునామాలోగానీ లేదా 9704887402కు ఫోన్‌చేసి సాయం అందించమంటున్నారు.



హైదరాబాద్‌లో ఎం.ఎస్.రెడ్డి శబ్దాలయ థియేటర్ ఇన్‌ఛార్జ్‌గా వ్యవహరిస్తున్న రచయిత జయంపుకృష్ణ కుమారుడు కీర్తికృష్ణ, అమలల వివాహం 8వ తేది నెల్లూరు జిపిఆర్ గ్రాండ్ కళ్యాణ మండపంలో జరిగింది.



# సర్వ శిక్షా అభియాన్



## అందరూ చదవాలి - అందరూ ఎదగాలి

# రాజీవ్ విద్యామిషన్

శ్రీ పొట్టిశ్రీరాములు నెల్లూరుజిల్లా. ఫోన్ : 0861- 2320096, ఫ్యాక్స్ : 0861-2306515

## -: అభివృద్ధి కార్యక్రమాలు :-

- పిల్లలు నడిచి వెళ్లగల దూరంలో ఆవాస ప్రాంత పాఠశాలల ఏర్పాటు.
- నిర్దేశిత దూరం కన్నా ఎక్కువ దూరం నుండి ఆవాస ప్రాంత పాఠశాలలకు హాజరయ్యే పిల్లలకు రవాణా సౌకర్యం / శాటిలైట్ పాఠశాలల ఏర్పాటు.
- అన్ని ఆవాస ప్రాంత పాఠశాలలలో మౌళిక సదుపాయాల కల్పన, ఉపాధ్యాయుల ఏర్పాటు.
- 8 సంవత్సరముల ఎలిమెంటరీ విద్య అమలుకు ఉన్నత పాఠశాలలకు అదనంగా ఎంపిక చేయబడిన ప్రాథమికోన్నత పాఠశాలలలో 8వ తరగతి వరకు బోధన.
- పరీక్షలు లేని విద్య అమలులో భాగంగా 8వ తరగతి వరకు "నిరంతర సమగ్ర మూల్యాంకన" అన్ని పాఠశాలలో అమలు.
- విద్యార్థులపై మానసిక, శారీరక హింసలు నిషేధం.
- నూతన సిలబస్, పాఠ్యాంశములపై ఉపాధ్యాయులకు శిక్షణ.
- ప్రత్యేక అవసరాలు గల పిల్లల సేవల కొరకు భవిత పేరుతో 16 సహిత విద్యా రిసోర్సు కేంద్రాల ఏర్పాటు, ఉపకరణాల పంపిణీ, ఫిజియోథెరపీ సేవలు.
- గుర్తించబడిన వెనుకబడిన మండలములలో 56 మోడల్ క్లస్టర్ పాఠశాలల కేంద్రములుగా బాలికా సాధికారత కార్యక్రమాలు.
- మత విద్యతోపాటు సాధారణ విద్యను అందిస్తున్న 55 మద్రసాలకు చేయూత.
- బడిబయట బాలికల విద్య కొరకు 6 నుండి 10వ తరగతి వరకు 10 కస్తూర్బా గాంధీ బాలికల రెసిడెన్షియల్ విద్యాలయాలు(**KGBV**)
- బడి మానివేసి తిరిగి బడిలో చేరిన పిల్లల కొరకు 11 రెసిడెన్షియల్ / నాన్ రెసిడెన్షియల్ ప్రత్యేక శిక్షణా కేంద్రాలు.
  జవహర్ బాల ఆరోగ్య రక్ష అమలులో భాగంగా వైద్య ఆరోగ్యశాఖ సహకారంతో ఆరోగ్య పరీక్షలు, శస్త్ర చికిత్సలు.
- పాఠశాలల సమర్థ నిర్వహణకు ప్రభుత్వ, ఎయిడెడ్ పాఠశాలల్లో పాఠశాల మేనేజ్‌మెంట్ కమిటీ(**SMC**)ల ఏర్పాటు.
- పాఠశాలల నిర్వహణకు పాఠశాల గ్రాంటు, నిర్వహణ గ్రాంటు, ఉపాధ్యాయ గ్రాంటు మరియు కాంప్లెక్స్ గ్రాంట్లు విడుదల.
- అర్హులైన 1.94 లక్షల మంది 1 నుండి 8 తరగతుల విద్యార్థులకు 2 జతల యూనిఫామ్ బట్టల పంపిణీ.
- 131 ప్రాథమికోన్నత పాఠశాలలలో కంప్యూటర్ ఆధారిత విద్య(**CAL**)



**బి.శ్రీధర్**
జిల్లా కలెక్టర్ మరియు ఛైర్మన్
రాజీవ్ విద్యామిషన్(ఎస్.ఎస్.ఏ)
శ్రీ పొట్టిశ్రీరాములు నెల్లూరు జిల్లా

**డాక్టర్ డి.కోదండరామిరెడ్డి** పి.హెచ్.డి
ప్రాజెక్ట్ అధికారి
రాజీవ్ విద్యామిషన్(ఎస్.ఎస్.ఏ)
శ్రీ పొట్టిశ్రీరాములు నెల్లూరు జిల్లా





TOLL FREE : 1800 - 425 - 3525

## "విద్యాహక్కు చట్టం - బాలల భవితకు పట్టం"

# వారఫలాలు

*తేది 29-12-2012 నుండి 4-1-2013 వరకు వృషభంలో గురు, కేతువులు; తులలో శని; వృశ్చికంలో శుక్ర, రాహువులు; ధనుస్సులో రవి, బుధులు; మకరంలో కుజుడు; మిథున, కర్కాటక, సింహ, కన్యలలో చంద్రుడు సంచరిస్తారు.*




చేస్తున్న పనులు గతంలోకన్నా కొంత మేలనిపిస్తాయి. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలలోనివారు ఆర్థికంగా నిలదొక్కుకొంటారు. స్థిరాస్తులందు పెట్టుబడులు పెట్టే అవకాశం, నూతన వస్తువాహన సామగ్రి వంటివి సిద్ధించగలవు. దూర, విదేశీ ప్రయాణ ప్రయత్నాలు సానుకూలమౌతాయి. నూతన గృహనిర్మాణాది పనులు సాగగలవు. విద్యార్థులకు తమ ప్రయత్నాలపై కృషి అవసరం.




గతంలో ఏర్పడ్డ ఆటంకాలు తొలగి చేపట్టిన పనులలో విజయం సాధించగలరు. సోదర, సోదరీ వర్గాల సహాయ సహకారాలు లభిస్తాయి. వృత్తి, వ్యాపారాలవారికి మేలు కలుగుతుంది. కాని అదనపు ఆదాయాల కోసం ప్రాకులాడవద్దు. సంఘంలో మిమ్మల్ని గుర్తిస్తారు. విద్యార్థుల చదువులు చకచకా సాగక నిరాశలను ఏర్పరచగలవు. వ్యవసాయదారులకు మధ్యమ ఫలితాలుంటాయి.




తలపెట్టిన పనులు సామాన్యంగా వుండి క్రమేపి పుంజుకుంటాయి. వృత్తి, వ్యాపారాలలోని వారికి తగినంత ఆదాయం లేక నిరుత్సాహం వుంటుంది. తరచూ ప్రయాణాలు చేయవలసి వుంటుంది. సోదర, సోదరీల మైత్రి తగ్గే సూచనలున్నాయి. వ్యవసాయ పనులు ఆశాజనకంగా సాగుతాయి. కళా, క్రీడా రంగాల వారికి ద్వితీయార్థం నుండి బహుళ ప్రయోజనాలు సిద్ధించగలవు.




ఇంటాబయట సమస్యలు, వివాదాలు కనుక పేచీలు తెచ్చుకోకండి. లౌక్యం అవసరం. వృత్తి, వ్యాపారుల ఆర్థిక ఇబ్బందులు పెరగగలవు. ఉద్యోగులకు ఈవారం ప్రతికూలమైనది. చిన్న పనికి కూడా విపరీత జాప్యం వుంటుంది. బంధుమిత్రుల సహాయ సమ్మతులుంటాయి. ప్రయాణాల పట్ల జాగ్రత్త అవసరం. విద్యార్థులకు గ్రహ వ్యతిరేకతచే తరచూ ఆటంకాలుంటాయి.




ఈ రాశి వారికి మంచి అనుకూలతలుండి కుటుంబ సౌఖ్యం, గౌరవాభిమానాలు పెరుగుతాయి. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థిక వృద్ధి. ఇంట్లో చేసే శుభకార్య యత్నాలు ఫలిస్తాయి. నూతన పరిచయాలు లాభిస్తాయి. విద్యార్థులకు వ్యాసంగాలు అనుకూలిస్తాయి. వ్యవసాయదారుల పనులు సానుకూలిస్తాయి. రాజకీయులకు పై వర్గాల నుండి శుభవార్తలు, ఆర్థికాదాయం పెరుగుతుంది.




కుటుంబంలో చిక్కులు, చికాకులు, సంతాన విషయమై ఆందోళన వుంటుంది. చేసే పనులలో తరచూ ఆటంకాలు, నూతన ప్రయత్నాలలో ఇబ్బందులు వుంటాయి. కోర్టు వ్యవహారాలు వాయిదా కోరుట మంచిది. స్థిరాస్తి తగాదాలలో రాజీ ప్రయత్నాలు ఫలిస్తాయి. విద్యార్థుల చదువుకై దూర ప్రయాణ ప్రయత్నాలు ఫలిస్తాయి. వ్యవసాయదారులకు పనులలో అనుకూలతలు వుంటాయి.




వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థిక విషయాలలో మెళకువ అవసరం. కోర్టు వ్యవహారాలు వాయిదా వేసుకొనుట మంచిది. విద్యార్థులు స్వశక్తికి ప్రాధాన్యతనిచ్చి, ఇతరుల సహాయానికి ఎదురు చూడవద్దు. వ్యవసాయదారుల రుణ ప్రయత్నాలు ఫలిస్తాయి. కళా, క్రీడా రంగాలలోని వారు వ్యవహారాలలో మెళకువ పాటించాలి. రాజకీయులు చేసే వ్యవహారాలు శుభాశుభ మిశ్రమంగా వుంటాయి.




ఈ వారం నుండి గ్రహానుకూలతలు సాగి క్రమక్రమంగా మంచి మార్పులు చూస్తారు. వృత్తి, వ్యాపారాలలో అనుకూలతలు పెరిగి, ఇతరుల సహాయ సహకారాలు పొందగలరు. విద్యార్థుల ఆలోచనలు కలసిరావడం, వ్యవసాయదారులు ఆర్థికంగా వృద్ధి చెందడం, ఇంట్లో శుభకార్య యత్నాలుంటాయి. కళా, క్రీడా రంగాలలోని వారికి ఇతరుల సహాయంచే ఆర్థికాదాయం వుంటుంది.




ఈ వారాంతంలో గ్రహానుకూలతలు కలిగి వాయిదా వేసిన పనులన్నీ సకాలంలో పూర్తి చేయగల్గుతారు. రావలసిన బకాయిలు వసూలయ్యి వృత్తి, వ్యాపారాలు పుంజుకుంటాయి. ఇంట్లో తలపెట్టిన శుభ, ముఖ్యమైన పనులు పూర్తికాగలవు. ప్రయాణాలలో తొందరపాటు పనికి రాదు. విద్యార్థులు చకచకా తమ పనులు పూర్తి చేస్తారు. వ్యవసాయదారులు చేసే రుణ ప్రయత్నాలు ఫలిస్తాయి.




గ్రహాల శుభసంచారంచే తలపెట్టిన పనులన్నీ పూర్తి చేయగల్గుతారు. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారి మనోభీష్టాలు నెరవేరుతాయి. ఆధ్యాత్మిక భావనల వృద్ధి. కుటుంబ వ్యక్తులతో భార్యాభర్తల సంబంధాలు మెరుగౌతాయి. డాక్యుమెంట్లు తదితర విషయాలలో లిఖితపూర్వకంగా వుండేట్లు చూసుకోవేది. తొందరపడి హామీలివ్వవద్దు. విద్యార్థులకు నిరుత్సాహదాయకంగా వుంటుంది.




తలపెట్టిన పనులన్నీ సానుకూలిస్తాయి. ప్రయాణాలలో జాగ్రత్తలు అవసరం. ఉద్యోగులు తమ ఉద్యోగాల మార్పుకై ప్రయత్నించక పట్టుదలతో ముందుకు సాగాలి. స్థిరాస్తి విషయాలలో స్థిరం చేసేందుకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. విద్యార్థులు శక్తికి మించిన పనులకు దూరంగా వుండాలి. వ్యవసాయదారులకు ఆర్థికంగా బాగుంటుంది. రాజకీయులు తలపెట్టిన ముఖ్యపనులన్నీ పూర్తికాగలవు.




చేసే పనులలో ఆటంకాలెదురైనా పూర్తికాగలవు. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థిక వ్యవహారాలలో ఇబ్బందులెదురైనా అనుకూలిస్తాయి. ఇతరులపై ఆధారపడే కన్నా స్వశక్తికి ప్రాధాన్యత ఇవ్వడం మంచిది. విద్యార్థులు ఆశాభంగాలు ఏర్పరచుకొనక స్థిరచిత్తంతో వ్యవహరించాలి. వ్యవసాయదారులు ఆస్తి మార్పుల ఆలోచనలకు దూరంగా వుండాలి.

## పంచాంగం

30తేది పరశురామ జయంతి.

**శుభ ముహూర్తాలు**

29, 30తేదీలలో సీమంత, అన్నప్రాసనాది, గర్భదానాదీనం, నవవధు ప్రవేశ మరియు జనవరి 1, 3, 4తేదీలలో వివాహాది మరియు సామాన్య వ్యవహారాలకు ముహూర్తాలున్నాయి.

**డిసెంబర్ తిథులు**

**మార్గశిర బహుళ**

| | | | |
|---|---|---|---|
| 29 | శని | పాడ్యమి | సా 05.55 గం.ల.వ |
| 30 | ఆది | విదియ | సా 07.40 గం.ల.వ |
| 31 | సోమ | తదియ | రా 09.02 గం.ల.వ |

**జనవరి తిథులు**

| | | | |
|---|---|---|---|
| 1 | మంగళ | చవితి | రా 09.58 గం.ల.వ |
| 2 | బుధ | పంచమి | రా 10.27 గం.ల.వ |
| 3 | గురు | షష్ఠి | రా 10.27 గం.ల.వ |
| 4 | శుక్ర | సప్తమి | రా 09.54 గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.

# స్థలమెరిగి నివాసము - ధర్మశాస్త్ర సారాంశము!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345. సెల్: 9490125878.

*కె.ఎన్.పృధ్వీరాజ్ నెల్లూరు*

* *గృహ నిర్మాణం తర్వాత స్థల ప్రభావం కూడా వుంటుందా?*

గృహానికి ఆధారమైన స్థల ప్రభావం గృహంపై చాలా ఎక్కువ. గట్టి నేలలు, శల్యావశిష్టాలు రహిత స్థలాలు ఎంపిక చేసుకోవాలి. స్థలం గ్రహ ప్రభావాలు కలిగినదై వుండకూడదు.

*వింజం రవివర్మ నెల్లూరు*

* *వీధిపోట్లు, వీధి చూపులు ఉన్నప్పుడు గృహస్థులు ఏం చేయాలి?*

పోట్లు, చూపులు రెండు కూడా దిష్టిని కలిగిస్తాయి. అయితే పోట్లు వేధించే పీడిస్తాయి. అందుచేత తక్షణం యంత్ర ప్రతిష్టలు చేసుకోవాలి.

*వి.మనోహర్‌రెడ్డి నెల్లూరు*

* *ఇల్లు కట్టుకుని కష్టాలు కొని తెచ్చుకున్నానేమో అనిపిస్తోంది.*

నిర్మాణ సమయంలో వాస్తును పాటించక కష్టాలొచ్చాక వాస్తును గురించి ఆలోచిస్తే ఎట్లా రెడ్డిగారూ? అవాస్తు నిర్మాణాలను తీసివేసి మళ్లీ రెండు, మూడు లక్షలు ఖర్చు పెడితే కర్మ విమోచనం అవుతుంది.

*డి.ఉమారవి సూళ్లూరుపేట*

* *గృహంలో వాయువ్య, నైరుతిలు పెరిగాయి. సమస్యలు ఎక్కువగా ఉన్నాయి?*

మానసిక ఒత్తిడులు, అనారోగ్య సమస్యలకివి కారణమవుతాయి. నిర్ధారిత యంత్ర ప్రతిష్ట చేయడం సమస్యకు పరిష్కారం.

*సి.హనుమంతు సికింద్రాబాద్*

* *కంటి రెప్పపైన, వక్షస్థలంపైన నల్లని పుట్టుమచ్చలున్నాయి. ఫలితాలెలా ఉంటాయి?*

అలాంటి స్త్రీలు గర్విష్టులుగానూ, అహంకారులుగానూ ఉంటారని కొన్ని గ్రంథాలు చెప్పాయి. అయితే అందరి విషయంలోనూ ఇదే నిర్ధారణకు రావడం అంత మంచిది కాదు.

*పి.శంకరరావు గూడూరు*

* *ఎడమ చంక, అదే తొడ, కన్ను క్రింది భాగాలలో ఎర్రని పుట్టు మచ్చల వల్ల ఏదైనా ప్రమాదమా?*

పై భాగాలలో మచ్చలు స్త్రీ, పురుషుల కెవరికున్నప్పటికీ ఆకస్మిక సమస్యలని చెప్పబడింది. వీళ్ల సంబంధిత రత్నాన్ని ధరించడం ఆపదలకు పరిష్కారం.

*ఇ.పరంధామయ్య కోవూరు*

* *చేపల పెంపకం కూడా రొయ్యల వలె నష్టాలుగా ఉంది. మంచి సలహా యివ్వండి?*

శాస్త్రజ్ఞుల సూచనలు పాటిస్తూ, భూమి వాస్తును ఖచ్చితంగా అమలు చేయండి. మంచి ఫలితాల కోసం సంబంధిత యంత్ర ప్రతిష్ట చేసుకోండి.

*ఎం.సుందరయ్య కలువాయి*

* *పశువులు కొనుగోలు చేయాలి. ఏ వారాలు మంచివి?*

వృత్తి ధర్మ ప్రకాశికలో వ్యవసాయ పశువులు కృత్తిక, ఆరుద్ర, చిత్త, మృగశిర నక్షత్ర సమయాల్లో మంగళ, శని, ఆదివారాల్లో కొనుగోలు శుభాలనిస్తుందని చెప్పబడింది.

*బైరె సత్యనారాయణ సీతారామపురం*

* *నేను వస్త్ర వ్యాపారాన్ని ప్రారంభించాలనుకుంటున్నాను. మంచి ముహూర్తం చెప్పండి?*

అశ్విని, స్వాతి, అనూరాధ, శ్రవణ యుక్త నక్షత్ర సమయాల్లో పంచమి, సప్త, విదియ, తదియ తిథుల్లో ప్రారంభించండి.

*సి.ఉషారాణి తడ*

* *మీరు యంత్రం ఇచ్చాక మంత్రంలాగా పనిచేసింది. కృతజ్ఞతలు.*

కుమార్తె వివాహం చేసి, గృహ ప్రవేశం జరిగినందుకు చాలా సంతోషం. కృతజ్ఞతలు భగవంతుడికి చెప్పండి.

*ఎన్.ఉమాశంకర్ వెదురుపూడి*

* *కొత్తగా వివాహం అయ్యింది. ఉత్తమురాలు నాకు లభించింది. అమ్మ వైఖరే నాకు నచ్చడం లేదు.*

అలా మీరనుకుంటున్నప్పుడు ఆమె తప్పేమిటో ఆమెకు నిక్కచ్చిగా చెప్పండి. ఇట్లాంటి విషయాల్లో తల్లి ఎట్లా ప్రవర్తించాలో కూడా గట్టిగా చెప్పండి. ఉత్తర ద్వారాన్ని ఈ నెలలోగా ఈశాన్యానికి మార్చండి.

• సభలు, సమావేశాలు, సమీక్షలు...

# జిల్లాలో స్తంభించిన పాలన!



కలక్టరేట్‌లో ఖాళీ కుర్చీలతో దర్శనమిస్తున్న పరిపాలనా విభాగం.

**జిల్లాలో గత నెల రోజులుగా పరిపాలన స్తంభించి పోవడంతో వివిధ ప్రభుత్వ కార్యాలయాలకు పనుల నిమిత్తం వెళ్లిన ప్రజలు వెనుతిరిగి రావాల్సి వస్తుంది. మరో పక్షం రోజులపాటు ఇదే పరిస్థితి కొనసాగేటట్లుంది.**

జిల్లాలో గత నెల రోజుల నుంచి పరిపాలన స్తంభించింది. అన్ని శాఖల అధికారులు సభలు, సమావేశాలు, సమీక్షల్లో పాల్గొంటున్నారు. దీంతో కార్యాలయాల్లో అధికారులు ప్రజలకు అందుబాటులో లేకుండాపోయారు. రాష్ట్ర ప్రభుత్వం వారంలో ఏదో ఒక కార్యక్రమం అమలుకు ప్రణాళికలు రూపొందించడం, అందుకు సంబంధించిన సమాచారాన్ని జిల్లాల నుంచి సేకరిస్తుంటుంది. ప్రభుత్వానికి పంపాల్సిన సమాచారం గురించి జిల్లా కలెక్టర్ అధికారులతో సమీక్షా సమావేశాలు నిర్వహించక తప్పడం లేదు. ఏ ప్రభుత్వ కార్యాలయానికి వెళ్లినా సంబంధిత అధికారి అందుబాటులో లేకుండా పోతున్నారు. కార్యాలయ సిబ్బందిని ప్రశ్నిస్తే కలెక్టర్ నిర్వహించే సమీక్షా సమావేశానికి వెళ్లారంటూ సమాధానం వస్తుంది.

ఈ నెలలో రావమ్మా మహాలక్ష్మీ, ప్రపంచ తెలుగు మహాసభలు, సూళ్లూరుపేటలో పక్షుల పండుగ నిర్వహణకు సంబంధించి ప్రభుత్వం ప్రకటన చేసిన సంగతి తెలిసిందే. రావమ్మా... మహాలక్ష్మీ కార్యక్రమం వైద్య, ఆరోగ్యశాఖకు సంబంధించినప్పటికి జిల్లాలోని అన్ని ప్రాధమిక ఆరోగ్య కేంద్రాల్లో నిర్వహించిన మూడు రోజుల అవగాహన కార్యక్రమంలో అధికార యంత్రాంగం పాల్గొంది. అలాగే తిరుపతిలో ఈ నెల 27, 28, 29 తేదీలలో ప్రపంచ తెలుగు మహాసభలు జరగనున్నాయి. ఈ సభలకు సంబంధించి నెల రోజుల నుంచి పాఠశాలల విద్యార్థులకు తెలుగు భాష గొప్పతనాన్ని గురించి వివరిస్తూ వివిధ సాంస్కృతిక కార్యక్రమాలు, ఆటలు, ముగ్గుల పోటీలు నిర్వహించారు. 20, 21 తేదీలలో నగరంలోని విఆర్సీ మైదానంలో తెలుగు మహాసభలను జయప్రదం చేయాలని కోరుతూ భారీ సదస్సు జరిపారు.

ఈ సదస్సుకు అన్ని ప్రభుత్వశాఖల అధికారులు తెలుగు సంప్రదాయాలను గుర్తు చేస్తూ వివిధ రకాల స్టాల్స్‌ను ఏర్పాటు చేశారు. గ్రామీణ ప్రాంతాల నుంచి కూడా భారీగానే ప్రజలు సదస్సుకు తరలివచ్చారు. ఈ సదస్సు విజయవంతానికి వారం రోజుల ముందుగానే ఏర్పాట్లలో అధికారులు నిమగ్నమైనారు. జనవరిలో మూడురోజులపాటు పక్షుల పండుగ నిర్వహించనున్నట్లు ఇప్పటికే కలెక్టర్ ప్రకటించారు. తెలుగు మహాసభల అనంతరం పక్షుల పండుగ ఏర్పాట్లలో నిమగ్నమవుతారు. ఇవి కాకుండా మండల పరిషత్, తహాశీల్దార్లతో సమీక్ష జరిపారు. అలాగే ప్రతిరోజు రాష్ట్రస్థాయి అధికారులు వీడియో కాన్ఫరెన్స్ నిర్వహిస్తుంటారు.

దీనికి కూడా జిల్లాస్థాయి అధికారులు హాజరవుతారు. నెలలో నాలుగు సోమవారాలు కలెక్టరేట్‌లో నిర్వహించే ప్రజావిజ్ఞప్తుల కార్యక్రమానికి కొన్ని శాఖల అధికారులు వెళుతుంటారు. అధికారులు సమీక్షలు, సమావేశాల్లో పాల్గొంటుండడంతో గ్రామీణ ప్రాంతాల్లో సంక్షేమ, అభివృద్ధి పథకాలు స్తంభించిపోతున్నాయి. ఏ పథకం కూడా పటిష్టంగా అమలు కావడం లేదు. ఏదైనా అత్యవసర పని నిమిత్తం జిల్లా అధికారులను కలవాలంటే సామాన్య ప్రజలకు సాధ్యపడని పరిస్థితి. అధికారులు వారి కార్యాలయాలకు ఏ సమయంలో వస్తారో, తిరిగి వెళతారో తెలుసుకోవడం కష్టతరంగా మారిందని ప్రజలు వ్యాఖ్యానిస్తున్నారు.

అధికారులు కార్యాలయాలకు రాలేకపోవడంతో సిబ్బంది కూడా హాజరుపట్టిలో సంతకం చేసి సొంత పనులు చక్కదిద్దుకొనే పనిలో పడ్డారు. పక్షుల పండుగ ముగిసే వరకు ప్రభుత్వశాఖల అధికారులు కార్యాలయాలకు వచ్చే అవకాశం లేదు. అంతవరకు ప్రజలు ప్రభుత్వ కార్యాలయాలకు వెళ్లడం మానుకొంటే ఛార్జీలైనా కలిసొస్తాయనాలి. ఏదిఏమైనా సభలు, సమావేశాలు, సమీక్షలు సామాన్య ప్రజల పనులు జరగుండా అడ్డంకులయ్యాయి.



# సరకులేని సారొచ్చారు!

✍ అల్లూరు రహీం

గత రెండేళ్లుగా ఒకే తరహా మేనరిజంతో కూడిన పాత్రలతో ఐదు చిత్రాల్లో నటించి అవి ఫట్ మనడంతో మంచి నిర్వేదంలో వున్నాడు మాస్ మహారాజు హీరో రవితేజ. ఆయన్ను హిట్ బాట పట్టించాలని ప్రముఖ నిర్మాత అశ్వనీదత్ కుమార్తె ప్రియాంక దత్ నిర్మాతగా వ్యవహరించి త్రీ ఏంజల్స్ పతాకంపై తీసిన చిత్రం సారొచ్చారు. ఈ చిత్రానికి మంచి ప్రేమకథతో అనే ట్యాగ్‌లైన్ పెట్టారు. వాస్తవానికి సారొచ్చారు సినిమా 'మిస్టర్ పర్‌ఫెక్ట్' చిత్రం ఫార్మేట్‌లో సాగుతుంది. గతంలో ఎన్నో ప్రేమకథా చిత్రాల్లో మెప్పించిన రవితేజ 'సారొచ్చారు'లో ప్రేక్షకులను మెప్పించలేకపోవడానికి ముఖ్య కారణం మంచి కథ లేకపోవడమే. ఈ కథలో ఎంత సాగదీత వుందంటే ప్రథమార్ధమంతా విమానంలోనే కథ నడుస్తుంది. ద్వితీయార్ధం కారు ప్రయాణంలో సాగుతుంది. ప్రేమకథంటే మనసును తుళ్లింపజేసే సన్నివేశాల సృష్టి జరగాలి. నవరసాలుండాలి. సారొచ్చారులో ఎందువల్లో హాస్యరసం వైపే దర్శకుడు దృష్టి పెట్టలేదు. ఇద్దరు అందమైన హీరోయిన్లు, దేవిశ్రీ ప్రసాద్ సంగీతం, విదేశీ బ్యాక్ డ్రాప్‌లో చిత్రాన్ని లాగేయవచ్చను కొన్నాడు. పసలేని కథతో స్క్రీన్‌ప్లేపై కనికట్టు కొనసాగించలేమని ఈ సినిమాకు కథ, స్క్రీన్‌ప్లే, మాటలతోపాటు దర్శకత్వ బాధ్యతలు నెరపిన పరశురామ్‌కు ఇప్పటికే తాను చేసిన తప్పేమిటో అర్ధమైపోయి వుంటుంది. ఈ చిత్రంలో హీరోయిన్ కాజల్‌కు తాను అందగత్తెనన్న బలుపుజాస్తి. దీంతో ఆమె నోటికొచ్చినట్లు అందర్నీ తిట్టేస్తుంది. హీరోనైతే పందిలా తిని పడుకో, నువ్వు అది ఇది చేసేస్తే తుడుచుకొంటున్నాననే చండాలపు డైలాగులు పలుకుతుంది. ఈ గలీజు డైలాగులు అవసరమా పరశురామా? ఆయనే వ్రాసిన లవ్ ఈజ్‌ది సీక్రెట్ ఆఫ్ ఎనర్జీ, పెళ్లయిన తర్వాత అమ్మాయిలు మారిపోతారు, లవ్ ఎట్ లాస్ట్ సైట్, అర్ధం చేసుకొన్న మనిషితో జీవితాంతం బాగుంటుంది. పెళ్లి తర్వాత ప్రేమ మొదలవ్వాలి డైలాగులు కాస్త పరవా లేదనాలి. చంద్రబోస్, అనంత శ్రీరాం సాహిత్యం కూర్చిన మిరపకాయ్ లాంటి పిల్లదండి, రచ్చ రంబోలా, గుసగుసలాడుతుంది, కాటుక కళ్లు చరణాలతో సాగే పాటలకు దేవిశ్రీ ప్రసాద్ వినసొంపైన సంగీతం అందించాడు. ఇది కూడా లేకుంటే ఈ చిత్రాన్ని అసలు చూడలేం. లేత హీరోయిన్లు కాజల్, రిచాలకు ముదురు ప్రేమికుడు రవితేజ జోడి కుదరలేదని సారొచ్చారు చూసిన ప్రతి ఒక్కరికీ అర్ధమైపోతుంది.




చిత్రకథలోనికి వెళ్తే పారిస్ నుంచి ఇండియాకు ఒకే విమానంలో బయలుదేరే సంధ్య(కాజల్), కార్తీక్ (రవితేజ)కు ఆ దేశంలో కాస్త పరిచయముంటుంది. కార్తీక్ వ్యక్తిత్వమంటే ఇష్టపడే సంధ్య అతన్ని ఇండియాకు వెళ్లే లోపు తన ప్రేమలో పడేలా చేస్తానని స్నేహితులతో ఛాలెంజ్ చేస్తుంది. విమానంలో కార్తీక్ దృష్టి తనవైపు మళ్లించను నానా రకాలుగా యత్నిస్తుంది. దీంతో అతను నాకు ఇది వరకే పెళ్లయ్యిందంటాడు. అయినా ఆమె ఆ ప్రేమకథను చెప్పమంటుంది. తాను ఊటీలో ఫుట్‌బాల్ కోచ్‌గా వుండగా అక్కడ బాగా డబ్బున్న కుటుంబీకురాలు వసు(రిచా)ను ప్రేమించానంటాడు. పెద్దలను ఎదిరించి పెళ్లి చేసుకొన్నా ఎల్లవేళలా వసును తాను అంటిపెట్టుకొని వుండకపోవడం ఆమెకు నచ్చక విడాకులు తీసుకోవాలని ప్రతిపాదించిందంటాడు. దీంతో సంధ్య ఎగిరి గంతేస్తుంది. తనను పెళ్లి చేసుకోమంటుంది. విమానం దిగాక కారులో వీరిద్దరి ప్రయాణం మొదలవుతుంది. ఒక డాబా దగ్గర కాస్త గొడవ జరిగాక పోలీసులతో కార్తీక్, సంధ్య తన భార్య అంటాడు. మార్గమధ్యమంలో తన ఇంటికి తీసుకెళ్లి తల్లితండ్రుల ముందు ఈ అమ్మాయే మీ కోడలంటాడు. ఇదేమి ట్విస్ట్ స్వామి అని సంధ్య – కార్తీక్‌ను అడగ్గా అసలు తనకు పెళ్లి కాలేదని, కావాలని లల్లాయి కథ చెప్పానంటాడు. దీంతో కస్సుబుస్సుమంటూ ఇంటికెళ్లిపోతుందామె. అక్కడ ఆమె తల్లితండ్రులు (జయసుధ, చంద్రమోహన్) సంధ్యను బాగా ఇష్టపడే గౌతం(నారా రోహిత్)తో పెళ్లికి అన్నీ ఏర్పాట్లు చేస్తారు. సంధ్యలో దిగులు గమనించిన గౌతమ్ కార్తీక్‌తో మాట్లాడి వాళ్లిద్దరినీ ఒకటి చేయడంతో సినిమా ముగుస్తుంది. ప్రేక్షకులను బాగా నిరాశపర్చే చిత్రంగా సారొచ్చారును చెప్పుకోవచ్చు.

## వరుస మల్టీస్టారర్ చిత్రాలు!

హీరో వెంకటేశ్‌ది విలక్షణశైలి. మల్టీస్టారర్ సినిమాల్లో నటించడానికి ఎప్పుడూ వెనకాడనితత్వం ఆయనది. అలాంటి కథల కోసం ఎప్పటి నుంచో ఎదురు చూస్తున్నారు. ఇన్నాళ్లకు 'సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు'తో ఆయన ఆలోచనలకు దగ్గరైన సినిమాలో నటించే అవకాశం దక్కింది. ఈ విషయమై ఆయన మాట్లాడుతూ ఈ తరంతో పనిచేయాలని ఉంది. ఇప్పుడిప్పుడే ఆ అవకాశాలు వస్తున్నాయి. మహేష్‌బాబు గొప్ప స్టార్. సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు సినిమాలో అతనితో కలసి చేయడం ఆనందాన్నిచ్చింది. త్వరలోనే రామ్‌తో కలసి ఓ సినిమా చేయబోతున్నా. బోల్‌బచ్చన్‌కి రీమేక్ అది. చాలా తమాషాగా సాగే సినిమా. రానాతో కూడా చేయాలి. తానూ బాగా ఎదిగాడు. నటనలో పరిపక్వత వచ్చిందన్నారు. ఈ సినిమాల తర్వాత ఇంకొన్ని మల్టీస్టారర్ చిత్రాల్లో నటించే అవకాశం వచ్చినా ఎటువంటి శతబిషలు పెట్టుకోకుండా నటిస్తానన్నారు.



## ప్రేమలో పడలేదు

ఏ మాయ చేసావె, ఎటో వెళ్లిపోయింది మనసు చిత్రాల్లో హీరోయిన్ సమంత పోషించిన ప్రేమికురాలి పాత్రలు యువతరం హృదయాలను కొల్లగొట్టాయి. ప్రేమిస్తే ఇలాంటి అమ్మాయినే ప్రేమించాలని ఆలోచించే అబ్బాయిలు ఎక్కువయ్యారు. ప్రేమికురాలి పాత్రల్లో అంత బాగా నటిస్తున్నారు. మీరు కూడా ఎవర్నైనా ప్రేమించారా అని సమంతను అడిగితే... ప్రియురాలిగా నటించాలంటే ప్రేమలో పడాల్సిన అవసరమే లేదు. సమాజాన్ని అర్థం చేసుకుంటే చాలు. నేను రకరకాల మనుషుల్ని చూశాను. అందులో ప్రేమికులు కూడా ఉన్నారు. ప్రేమికులకు సమస్యలు ఎదురైనప్పుడు ఎలా వ్యవహరిస్తుంటారు. సంతోషాన్ని పంచుకొనేటప్పుడు వాళ్ల భావోద్వేగాలు ఎలా ఉంటాయి అనే విషయం నాకు బాగా తెలుసు. పైగా ప్రతి విషయాన్నీ దర్శకులు విడమర్చి చెబుతున్నప్పుడు ఇంకా ప్రాక్టికల్ నాలెడ్జ్ అవసరమే రాదంది సమంత.



## అనుష్కకు వ్యాపకాలు జాస్తి!



నిర్మాతలకు బాగా సహకరించే హీరోయిన్‌గా అనుష్క పేరు తెచ్చుకొంది. ఇటీవల ఆమె నటించిన డమరుకం చిత్రంలోని పాత్రకు మంచి పేరొచ్చింది. మిర్చి సినిమా షూటింగ్ గ్యాప్‌లో పిచ్చాపాటీగా మాట్లాడుతూ వీలైతే నలుగురికి సహాయం చెయ్యాలికానీ... ఇబ్బంది పెట్టకూడదు అనే వ్యక్తిత్వం నాది. సెట్‌లో కానీ, బయటకానీ... అందుకు తగ్గట్టుగానే నడుచుకొంటాను. యోగా అనేది నా జీవితంలో ఒక భాగం. యోగా వల్లే నా వ్యక్తిత్వాన్ని నేను మరింత ఉన్నతంగా తీర్చిదిద్దుకొన్నాను. ఇతర వ్యాపకాల విషయానికొస్తే ఒక పెద్ద లిస్టే అవుతుంది. ప్రయాణాలంటే చాలా చాలా ఇష్టం. ఇష్టమైన ప్రదేశాలన్నీ చుట్టేస్తుంటాను. అలాగే గార్డెనింగ్ అన్నా ఇష్టమే. ఇంటికెళ్తే పెరట్లో పనులన్నీ నేనే చేస్తుంటాను. వార్తా పత్రికల్లో ఏవైనా మంచి ఆర్టికల్స్ కనిపిస్తే వాటిని కట్‌చేసి భద్రపరుస్తుంటాను. ఖాళీ సమయాల్లో వాటిని తీసి చదువుతుంటాను. నాకు తెలిసిన వాళ్లకూ ఇచ్చి చదవమని చెబుతుంటాను. ఇలా వ్యక్తిగత జీవితంలో చాలా వ్యాపకాలే ఉన్నాయంది.

## అప్పుడే పెళ్లేంటి?

హీరోయిన్ జీవితం చిత్రవిచిత్రంగా ఉంటుందంది శ్రియ. హీరోయిన్‌గా పదేళ్ల ప్రస్థానం పూర్తిచేసిన ఆమె మాట్లాడుతూ ఢిల్లీలో బస్సు ఎక్కడం కూడా తెలియని నేను నిత్యం విమానాల్లో తిరిగే స్థాయికి ఎదిగాను. పరిశ్రమలో వైవిధ్యమైన పాత్రల కోసం పడుతూలేస్తూ నటించానంది. ఇంతకూ పెళ్లెప్పుడంటే నేను నా కుటుంబ సభ్యులతో సంతోషంగానే ఉన్నాను. జీవితంలో ఓ తోడు అవసరమే. కానీ దానికింకా సమయం రాలేదు. వస్తే ఆగదు. పెళ్లికి సంబంధించి నేనైతే ఎలాంటి ప్రణాళికలు వేసుకోలేదు. నేను స్టార్‌గా ఈ స్థాయికి చేరుకోవడం వెనుక నా కుటుంబం ప్రోత్సాహం ఎంతో ఉందని చెప్పింది.



## డబ్బే ముఖ్యం కాదు

నూతన సంవత్సరం వస్తోందంటే చాలు హీరోయిన్లలో కొత్త జోష్ కనిపిస్తుంది. కారణం ప్రత్యక్ష ప్రదర్శనలతో అదనపు ఆదాయం రాబట్టుకోవచ్చు. డిసెంబర్ 31వ తేది రాత్రి కొన్ని గంటలపాటు జరిగే ఆ ప్రదర్శనలు హీరోయిన్లకు కాసులు కురిపిస్తుంటాయి. ఆ ప్రదర్శనలతో జోష్‌కి జోష్, డబ్బుకు డబ్బు అన్నట్లుగా ఉంటుంది వ్యవహారం. అయితే ఆ తరహా ప్రదర్శనల్లో తాను పాల్గొనడంలేదని చెబుతోంది మలబారు ముద్దుగుమ్మ ఆసిన్. ఈ విషయమై వివరిస్తూ క్రిస్టమస్, కొత్త ఏడాది రోజు నా కుటుంబంతో గడపడం అలవాటు. నేను డబ్బుకు ప్రాధాన్యత ఇవ్వను. నేను ఒక సినిమా చెయ్యడం వెనుక ప్రధానంగా ఐదు కారణాలుంటాయి. స్క్రిప్ట్, నా పాత్ర, దర్శకుడు, నిర్మాత, సహనటులు. డబ్బు మాత్రం ఈ జాబితాలో ఎప్పటికీ ఉండదంది.

## కాంగ్రెస్‌కు మరణ శాసనం

మొదటి పేజీ కొరవ

త్వం మీద, పోలీసుల మీద, మీడియా సంస్థల మీద, న్యాయస్థానాల మీద ప్రజలలో ఎంతటి విశ్వాస రాహిత్యం ప్రబలుతున్నదో ఈ ఆక్రోశాన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు. ఈ సూక్ష్మాన్ని గ్రహించడంలో కాంగ్రెస్ నాయకత్వం దారుణంగా విఫలమైంది.

ఉప్పెన వలె ఉప్పొంగి వస్తున్న యువ లోకాన్ని ఉపశమింప చేయడంలో కేంద్ర ప్రభుత్వం వైఫల్యం చెందింది. అటువంటి పూనకాలకు పరిహారం "బలి" మాత్రమే. ఆ దుర్ఘటనకు ప్రత్యక్ష బాధ్యత లేకున్నా, నైతిక బాధ్యత వహించవలసిన హోంమంత్రిని, పోలీసు ఉన్నతాధికారులను బలి చేసి వుంటే కొంతలో కొంత కోపం చల్లారేది. యువకులు కోరేది సత్వర న్యాయం, కఠిన శిక్ష మాత్రమే. ఆ కోణంలో చర్యలు ప్రభుత్వానికి పెద్ద పని కాదు. చట్ట సవరణలకు స్పష్టమైన హామీ ఇచ్చి వుంటే ఆవేశం శాంతించేది. కానీ కేంద్ర హోంమంత్రి సుశీల్‌కుమార్ షిండే చాలా తేలికగా తీసుకొన్నాడు. పరిస్థితి తీవ్రతను అంచనా వేయడం చేతకాలేదు. ఫలితం – మొత్తం వ్యవస్థ మీదనే యువలోకంలో అవిశ్వాసం. జరిగిన ఆందోళన సమస్తం శాంతియుతంగానే నడిచింది. వారిపైకి పోలీసు బలగాన్ని ఉసి గొల్పడం అనవసరం. ఆ తప్పును నివారించలేక పోవడం ప్రభుత్వ అవగాహనా లోపం. ఉద్యమాన్ని మావోలతో పోల్చడం మరింత అపచారం.

రాష్ట్ర స్థాయిలో కూడా పిసిసి అధ్యక్షుడు బొత్సా సత్యనారాయణ దీనిపై తేలికగా మాట్లాడాడు. పరిస్థితి ఎంత తీవ్రంగా వుందో అర్థం చేసుకోలేని అమాయకత్వంతో వ్యవహరించాడు. ఫలితం – ప్రజల శాపనార్థాలు. రాష్ట్రంలోని ప్రతి మహిళా బొత్సా వ్యాఖ్యలను తప్పు పట్టింది. ఈసడించింది.

దుర్ఘటనతో కానీ, దానికి కారకులైన వారితో కానీ ఏ మాత్రం సంబంధం లేకుండానే కాంగ్రెస్ పార్టీ తనకు తాను రాజకీయ మరణ శాసనం లిఖించుకొన్నది. యువలోకాన్ని శాంతి పరచడానికి ఒకరిద్దరు వ్యక్తుల బలితో సరిపోయేదానికి ఇప్పుడు మొత్తం పార్టీయే రాజకీయంగా బలై పోయింది. మానవీయ అంశాలలో స్పందన చూపలేని గొడ్డు మోతు పార్టీగా ప్రజల నిరసనలను, నీలాపనిందలను తలకెత్తుకొన్నది.

## ప్రాణం విడిచిన పేదల ప్రాణదాత

మొదటి పేజీ కొరవ

ఇచ్చే పథకంగా తీర్చి దిద్దాడు. ఆ తర్వాత కాలంలో వైఎస్‌కు ఎనలేని కీర్తి ప్రతిష్టలు పెంచిన పథకంగా మారింది. ఈ రోజు వైఎస్ జగన్ పట్ల కోట్లాది మంది జనం ఆదరణ చూపడానికి గల కారణాలలో ఆరోగ్యశ్రీ ఒకటి అంటే, కిరణ్‌కుమార్‌రెడ్డి మేధస్సు వారి రాజకీయానికి ఎంతగా ఉపకరించిందో అర్థం చేసుకోవచ్చు.

వైఎస్ దగ్గర పని చేసి, ఎన్నో ప్రయోజనాలు పొందిన అధికారులెవరూ ఈ రోజు ఆ ఇంటి పరిసరాలలో కన్పించడం లేదు. కానీ కిరణ్‌కుమార్‌రెడ్డి మాత్రం స్టాటిస్టిక్స్ డిపార్ట్‌మెంట్‌లో తన ఉద్యోగానికి రాజీనామా చేసి జగన్ పార్టీలో సభ్యుడిగా చేరిపోయాడు. వైఎస్ కుటుంబానికి తన జీవితాన్ని అంకితం చేశాడు. జగన్ పార్టీ అధికారంలోకి వస్తే, ప్రజలకు ఉపయోగపడే పథకాలు వేటిని అమలు చేయవచ్చు అనే అంశంపై పరిశోధన చేస్తుండినాడు కిరణ్‌కుమార్‌రెడ్డి. కోట్లాది మంది రైతుల జీవితాలను మెరుగు పరచేందుకు "హరితశ్రీ" పేరుతో ఒక పథకానికి రూపకల్పన చేశాడాయన. దానికి జగన్ ఆమోదం కూడా తీసుకొన్నాడు. ఎన్నికల సమయంలో, తన ప్రధాన ప్రణాళికగా ఆ పథకాన్ని ప్రకటించాలనే ఆలోచనలో వుండినాడు జగన్.

కిరణ్‌కుమార్‌రెడ్డి, నెల్లూరుజిల్లా దామరమడుగు వాసి. రైతు కుటుంబీకుడు. రిటైర్డ్ ఎమ్మార్వో ఆదిశేషారెడ్డి ఆయన సోదరుడు. ఆరోగ్యశ్రీకి ముందు, ముఖ్యమంత్రి సహాయ నిధి నుంచి పేదల ఆరోగ్యానికి నిధులు విరివిగా ఇచ్చేందుకు వైఎస్‌ను ఒప్పించింది కూడా కిరణ్‌కుమార్‌రెడ్డి కావడం గమనార్హం. కొన్ని లక్షల మందికి ఆ రూపంలో ప్రాణదానం చేశాడు కిరణ్‌కుమార్‌రెడ్డి. వారి కుటుంబానికి మా ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నాము.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

నన్ను కోసం జనం సంతకం' కార్యక్రమం నిర్వహించారు. పార్టీ జిల్లా కన్వీనర్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి, కొమ్మి లక్ష్మయ్యనాయుడు, కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి పెద్దసంఖ్యలో పార్టీ కార్యకర్తలు అభిమానులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## అల్లూరు ఆదిశేషారెడ్డి మరణం

గూడూరులో ప్రముఖ వ్యక్తి, విద్యాదాత, క్రీడాపోషకుడు, వీటిన్నింటికీ మించి గొప్ప మానవతావాది అల్లూరు ఆదిశేషారెడ్డి(95) 24వ తేది చెన్నైలో మరణించారు. ఆదిశేషారెడ్డి స్వగ్రామం కొడవలూరు మండలంలోని యల్లాయపాళెం. మైకా వ్యాపారం చేయను గూడూరు వచ్చిన ఆయన ఇక్కడే స్థిరపడ్డాడు. ఆదిశేషారెడ్డి తన పేరిట పట్టణ నడిబొడ్డులో స్టేడియం నిర్మాణానికి లక్షలాది రూపాయలు సమకూర్చిన వ్యక్తి. క్రీడలు, సాహిత్య, సంగీతం అంటే ఆయనకు ఎంతో ఇష్టం. బీద విద్యార్థులకు పై చదువులకు ఇతోథికంగా సహాయపడేవారు. ఆయన ఇచ్చిన స్కాలర్‌షిప్పుతోనే ప్రస్తుతం తిరుపతి ఎమ్పీ చింతామోహన్ ఎంబిబిఎస్ చదివారు. రోటరీ హెల్త్‌వేజ్ పథకం ద్వారా 70 మందికిపైగా పేద వృద్ధులకు నెల నెలా కావాల్సిన నిత్యావసరాలన్నీ సమకూర్చేవారు. ఆయనకు భార్య, ఒక కుమారుడు, కుమార్తె ఉన్నారు.

## జక్కంరెడ్డి వరదారెడ్డి మరణం



కోవూరులో పెద్ద రైతు, బియ్యం, నిమ్మకాయల వ్యాపారిగా అందరికీ సుపరిచితుడైన జక్కంరెడ్డి వరదారెడ్డి(92) 22వ తేది మరణించారు. వరదారెడ్డి వదాన్యుడు. భార్య పేరిట కోవూరు బజారువీధిలో ఆంజనేయస్వామి దేవస్థానం వద్ద ముఖద్వారం కట్టించారు. పెళ్లకూరు రామచంద్రారెడ్డి కాలనీలో కళ్యాణ మండపం కూడా కట్టించారు. కోవూరు సిడిసి ఛైర్మన్‌గా పనిచేస్తున్న కృష్ణారెడ్డి ఈయన కుమారుడే. మరో ఇద్దరు కుమార్తెలున్నారు.

కుటుంబపెద్దలను కోల్పోయిన పై రెండు కుటుంబాల వారికి మా సానుభూతి.



సింహపురి సాంస్కృతిక సమాఖ్య 17వ వార్షికోత్సవ సందర్భంగా ఉత్తమ సేవలకు గాను నెల్లూరు జాయింట్ రిజిస్ట్రార్‌గా పని చేసి పదవీ విరమణ పొందిన పూడి నరేంద్రను సన్మానిస్తున్న ఎమ్పీ రాజమోహన్‌రెడ్డి. సన్మాన పత్రం చదువుతున్న సమాఖ్య కార్యదర్శి, మెజీషియన్ రాంజీ.

## జనవాణి

2వ పేజీ కొరవ

రక్షితః అన్న స్ఫూర్తిని పెంపొందించాలి. సభలు, సమావేశాలు, వినోదాలతో మార్పురాదు. ఆచరణలో వస్తుంది. పెద్దలు, ఉపాధ్యాయులు, సేవా సంస్థలు ఈ దిశగా కృషి చేయాలి.

ఎం.సుధామయి నెల్లూరు

### కోతలు... మోతల రాజ్యం!

రాష్ట్రంలో ఇటీవల వరకు ప్రజలు విద్యుత్ కోతలతో సతమతమయ్యారు. ఇప్పుడేమో సర్‌ఛార్జీల మోతలు మొదలయ్యాయి. ఎంతకాలమీ రంపపు కోతలు. విద్యుత్ కోసం దేవుళ్ని ప్రార్థించమని ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి సెల విచ్చారు. జనమంటే ఏమాత్రం లెక్కలేని విధంగా వివిధ ఛార్జీలను పెంచుతున్న కాంగ్రెస్ ప్రభుత్వానికి ఈసారి ఎన్నికల్లో డిపాజిట్లు దక్కవు. ఇది మాత్రం సత్యం.

పి.అరుణకుమారి నెల్లూరు

### దొంగల ముఠాలను పట్టుకోండి!

గత కొన్ని నెలలుగా నెల్లూరులో పగలు, రాత్రి అన్న తేడా లేకుండా దొంగతనాలు జరుగుతున్నాయి. వీధుల్లో నడిచి వెళ్తున్న మహిళల మెడల్లోని సరుదులు, చైన్లు లాక్కొని వెళ్తున్నారు. ఇళ్ల ముందు పార్కింగ్ చేసిన కార్లు, స్కూటర్లు పట్టుకెళ్తున్నారు. పవిత్రమైన దేవాలయాల్లో సైతం దొంగతనాలు ఆగడం లేదు. దొంగల పని పట్టే విషయంలో నెల్లూరు పోలీసుల మెతక వైఖరి వారిని వీధుల్లో నిలబెట్టినా మార్పు రాకపోవడం బాధాకరం.

కె.వెంకటసుబ్బయ్య నెల్లూరు

# రేట్లు పెంచినా మెరుగుపడని భోజనం!

సంక్షేమ వసతి గృహాల్లోని పిల్లల పరిస్థితి దారుణంగా ఉంటోంది. ప్రభుత్వం ఇచ్చే మొత్తం కంటే అదనంగా మెనూ రేట్లను సవరించినా పిల్లలకు సరైన ఆహారం అందని పరిస్థితి ఎదురౌతోంది. గతంలో ఒక్కో విద్యార్థికి 535 రూపాయలను చెల్లించేవారు. మార్కెట్‌లో అన్ని వస్తువులు ధరలు పెరగడంతో ఈ మొత్తాన్ని 850 రూపాయలుగా చేశారు. అంటే ఒక్కొక్కరికి ఇచ్చే మొత్తాన్ని 315 రూపాయలుగా పెంచుతూ నిర్ణయం తీసుకొంది. పెరిగిన ధరలతో విద్యార్థులకు ఇచ్చే మొత్తాలు ఏ మాత్రం సరిపోవడం లేదు. హాస్టల్ విద్యార్థులకు వారానికి ఆరు రోజులు అరటి పండు అందజేయాలని, నెలకు నాలుగు సార్లు స్వీట్స్ పెట్టాలని, ఉడికించిన కోడిగుడ్లు ఆరు ఇవ్వాల్సి ఉంది. అరటి పండ్లు, కోడిగుడ్ల ధరలు బయటి మార్కెట్‌లో చూస్తే గుడ్లు తిరుగుతున్నాయి. అరటి పండు మూడు నుంచి నాలుగు రూపాయలు, కోడిగుడ్డు ఐదు రూపాయలుగా ఉంది. చింతపండు, నూనె, పాలు, ఎర్రగడ్డలు, మిరపకాయలు తదితర వస్తువుల ధరలు పెరిగిపోయాయి. ప్రభుత్వం ప్రకటించిన ధరలకు మార్కెట్ ధరలకు వ్యత్యాసం ఉంది. ఈ వ్యత్యాసం వలన విద్యార్థులకు మంచి నాణ్యమైన ఆహారాన్ని అందించాలంటే ప్రభుత్వం పెంచిన మొత్తాలు చాలేలా లేవు. గ్యాస్ సరఫరాలో ఆంక్షల కారణంగా సిలిండర్స్ అధిక ధరకు కొనుగోలు చేయాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. రవాణా ఖర్చులు పెరగడం, నిత్యావసర వస్తువుల ధరలు పెరగడం కారణంగా ఆ ప్రభావం చివరకు విద్యార్థులపై పడనుంది. చేతివాటం ప్రదర్శించే వార్డెన్లు, అవినీతి అక్రమాలకు పాల్పడే వారి కారణంగా హాస్టల్ విద్యార్థులకు ఇచ్చే మొత్తాలు పెంచినా కడుపు నిండా తినలేని పరిస్థితి ఎదురౌతుంది.

# విద్యుత్ సర్‌ఛార్జీలపై మంత్రుల నిలదీత!

విద్యుత్ ఛార్జీలతోపాటు, సర్‌ఛార్జీలను అడ్డగోలుగా పెంచడాన్ని నిరసిస్తూ తెలుగుదేశం పార్టీ నేతృత్వంలో రాష్ట్ర మంత్రులు ఆనం రామనారాయణరెడ్డి, పితాని సత్యనారాయణలను పినాకినీ అతిథి గృహం వద్ద నిలదీశారు. కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి నాయకత్వంలో పెద్ద సంఖ్యలో చేరుకొన్న ఆ పార్టీ కార్యకర్తలు అతిథి గృహం నుంచి మంత్రి రాగానే అడ్డుపడ్డారు. వివరాలన్నీ వ్రాసి వినతి పత్రం ఇవ్వాలని రామనారాయణరెడ్డి కోరగా వినతి పత్రం ఎందుకు మంత్రివర్యా... ఈ బిల్లులు చూడండని ఓ కట్టను శీనయ్య అందించగా మంత్రి పట్టించుకోకుండా కారు ఎక్కేశారు. దీంతో కాన్వాయ్‌కు తెలుగుదేశం కార్యకర్తలు అడ్డం పడ్డారు. పోలీసులు లాఠీఛార్జీచేసి కాన్వాయ్‌ను ముందుకు వెళ్లేలా చేశారు. తెలుగుదేశం కార్యకర్తలందరినీ ఉదయం నుంచి సాయంత్రం వరకు పోలీస్‌స్టేషన్‌లో నిర్బంధించారు. వదలితే ఎక్కడ మళ్లీ మంత్రులున్న చోటికి వెళ్లి నిరసన చేపడుతారోనని పోలీసులు భయపడ్డారు.

## పదరంగం -48

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | | 3 | 4 | 5 | | 6 | 7 |
| | | | | 8 | | | | | 9 | |
| | | 10 | | | | | | 11 | | |
| 12 | 13 | | | | | | 14 | | | |
| | | | 15 | | 16 | 17 | | | | |
| 18 | | | | | | 19 | | 20 | | |
| | | | 21 | 22 | | | | 23 | | |
| 24 | 25 | | | 26 | 27 | | 28 | | | |
| 29 | | | | | 30 | 31 | | | 32 | 33 |
| | | 34 | | 35 | | | | | 36 | |
| 37 | | | | 38 | | | | | 39 | |

**అడ్డం**

1. జీవిక, జీవనం (4)
3. అలవాటు (3)
6. శబ్దము (2)
8. పండితుడు, నిష్ణాతుడు, నేర్పరి (4)
9. అన్నవరం సత్యదేవుని భార్య (2)
10. ఇంద్రుని ఉద్యానవనం (5)
11. చీపు, ముతక (2)
12. అటునుంచి... కోడి జాతికి చెందిన పెద్దసైజు పక్షి (2)
14. నీటబుట్టినది, కమలం (3)
16. రామాయణ కాలపు ఒక నది (3)
18. నిన్న (4)
19. ఇరవైఐదు పైసల బిళ్ల (3)
21. అటునుంచి స్థలం, ప్రదేశం (2)
23. తెలుగు క్యూబ్, గొప్పది (3)
24. ముఖ్యమైనది (3)
26. సువాసన (2)
28. భిన్నంలో పైన వుండేది (2)
29. అటునుంచి పలుకు (2)
30. పెండ్లి కుమారుడు అటు నుంచి వస్తున్నాడు (3)
32. సత్తువ, బలం (2)
35. ఆదరించడం (4)
36. అటునుంచి నెమలి పింఛం (2)
37. చెట్లు అటునుంచి (3)
38. పురుగు, మిడత (4)
39. స్వప్నం (2)

**నిలువు**

1. హంస (4)
2. ఆకాశం (3)
3. బంధుత్వం, చుట్టరికం జంట పదాలుగా (5)
4. నందకుమారుని తండ్రి క్రింద నుంచి వస్తున్నాడు (3)
5. మిక్కిలి (2)
6. శబ్దము (2)
7. క్రింద నుంచి పొలము (2)
8. అడవి (2)
11. స్త్రీ, వింటిత్రాడు (2)
13. కోరిక (3)
14. గాలి (3)
15. నిదర్శనం (3)
17. మట్టి త్రవ్వే సాధనం పలుగుతోపాటే క్రింద నుంచి (2)
18. పురుగు పుట్రా (6)
20. నేర్పు (3)
22. తాతను పిలవండి (2)
25. క్రింద నుంచి దండ, హారం (2)
27. విముక్తి (4)
28. ఉప్పు (4)
30. రవి భయపడ్డారు 7,1,3 (3)
32. జాయిన్ అవడం (3)
33. తడబడిన వలపు (3)
34. ముదురు కాదు (2)
35. నిరాశ కానిది (2)

**సమాధానాలు**

## పదరంగం -47

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 క | 2 ర | 3 ట | క | ద | 4 మ | న | 5 కు | 6 లు | | |
| 7 కా | జో | లు | | | తం | | 8 ను | తు | 9 లు | |
| 10 వి | గు | పా | | | | 11 నా | కు | నీ | వు | |
| 12 క | ణం | | 13 అ | | 14 క | రా | | | 15 క | 16 ల |
| లు | | | 17 శృ | తి | ల | య | 18 లు | | | బ |
| | 19 అ | 20 ను | వు | | 21 అ | ణు | వు | 22 లు | | త |
| | 23 పు | వ్వు | లు | | | 24 డు | గో | పా | 25 లు | |
| 26 మా | రూ | లు | | 27 తి | | | | 28 శా | త | 29 ము |
| 30 ట | పం | | 31 పో | ర | గా | 32 డు | | | 33 వి | చ |
| కా | | 34 రో | క | లి | | గు | | 35 లు | క | వ |
| 36 రి | వా | జు | | 37 గ | రి | మ | | | | క |

# సంక్షిప్త సింహపురి

## పార్క్ స్థలాన్ని కాపాడండి!

నెల్లూరు దర్గామిట్ట ఎల్‌ఐసి ఆఫీసు ఎదురుగా సిసిఎస్ నగర్‌లో ఉన్న పార్క్ స్థలాన్ని పరిరక్షించాలని వైకాపా నెల్లూరు రూరల్ నియోజకవర్గ నాయకుడు కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి కోరారు. సిసిఎస్ నగరవాసులతో కలసి ఇటీవల ఆయన కార్పొరేషన్ కమిషనర్ టిఎస్‌ఆర్ ఆంజనేయుల్ని కలిశారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ఇప్పటికే నగరంలోని చాలా ప్రాంతాల్లో పార్కులు కనుమరుగయ్యాయన్నారు. అందుబాటులో ఉన్న పార్కులనైనా పరిరక్షించుకోవడంతో సహా అభివృద్ధి పరుచుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉందని పేర్కొన్నారు. ఈ వ్యవహారంలో అధికారులు చిత్తశుద్ధితో సహకరించాలన్నారు. కమిషనర్‌ను కలసిన వారిలో కెవిరాఘవరెడ్డి, రమణయ్య నాయుడు, శ్రీనివాసులు నాయుడు, హరినాయుడు, రాజా నాయుడు, చింతంరెడ్డి జనార్ధన్‌రెడ్డి తదితరులున్నారు.

## సిపిఎం సస్పెండ్ చేస్తే సిపిఐ ఉందిగా!

సిపిఎం పార్టీలో ఉంటూ పలు అవినీతి ఆరోపణలు ఎదుర్కొని సస్పెండ్ అయిన నాయకులను సిపిఐ అక్కున చేర్చుకోవడం రాజకీయ వర్గాల్లో చర్చనీయాంశమయ్యింది. గతంలో సిపిఎం పార్టీ బహిష్కరించిన మార్కెట్ నాగేశ్వరరావును సిపిఐ కావులించుకొని పార్టీలో చేర్చుకొంది. డివైఎఫ్ఐ రాష్ట్ర నాయకునిగా ప్రత్యేక గుర్తింపు తెచ్చుకొని కృష్ణపట్నం పోర్టు దగ్గర ఆ పార్టీని బంగాళాఖాతంలో ముంచిన నరహరిని సిపిఎం సస్పెండ్ చేసింది. ఏడాదిపాటు నిశ్శబ్ధంగా ఉండిన ఆయన సిపిఐ పార్టీ ఎమ్మెల్సీ పి.జె.చంద్రశేఖర్‌రావు, వి.రామరాజుల సమక్షంలో ఆ పార్టీలో చేరారు. సస్పెండెడ్ నాయకులను చేర్చుకొని సిపిఐ ఏం బావుకుంటుందో కాలమే సమాధానం చెప్పాలి.

## 60 ఏళ్లకే పడిపోయిన ఆయుః ప్రమాణం!

పర్యావరణంలో పెరుగుతున్న విష ప్రభావాలు ప్రయోగాత్మకంగా పాటించాల్సిన ఆరోగ్యపరమైన అంశాలపై నెల్లూరులో రెండు రోజులపాటు సదస్సు జరిగింది. విక్రమ సింహపురి విశ్వవిద్యాలయం నేతృత్వంలో జరిగిన ఈ సదస్సులో విశ్వవిద్యాలయం ఉపకులపతి జి.రాజారామిరెడ్డి, అమెరికా, ఐర్లాండ్‌కు చెందిన ప్రొఫెసర్లు హెచ్.జావియా, అనుమంత కాంత స్వామి, జమైలా కె.ఆడమ్ తదితరులు పాల్గొని మాట్లాడారు. శాస్త్ర సాంకేతిక రంగాల్లో అనూహ్య అభివృద్ధికి నోచుకుంటున్నా అదే సమయంలో మానవ ఆయుః ప్రమాణాలు మాత్రం దిగజారి పోతున్నాయనే సంగతి ప్రతి ఒక్కరూ గుర్తెరగాలన్నారు. గతంలో మానవ సగటు జీవితకాలం 85 సంవత్సరాల వరకు ఉండగా ఇప్పుడు 60 ఏళ్లకే పడిపోయిందన్నారు. 35 సంవత్సరాల ప్రాయం నుంచే వివిధ ప్రాణాపాయ రోగాలతో జీవిస్తున్నారన్నారు. వీటన్నింటికి ప్రధాన కారణం పర్యావరణాన్ని వెంటాడుతున్న కాలుష్య భూతమేనని అభిప్రాయ పడ్డారు. ఓజోన్ పొరకు సైతం భంగం వాటిల్లేలా పారిశ్రామిక కాలుష్యం వెంటాడుతుందని వాపోయారు. సింథటిక్ వ్యర్థ పదార్థాలు విరివిగా భూభాగంలోకి చొచ్చుకుని వస్తున్నాయన్నారు. వీటి వల్ల మానవాళికి తీరని ముప్పు కలుగుతుందన్నారు. ఈ సదస్సులో విదేశీ ప్రొఫెసర్లు చెప్పిన విషయాలు సభికులనందరినీ ఆలోచనలో పడేశాయి.

## డాక్టర్ ఏ.వి.రామారావుకు ఎల్లాప్రగడ అవార్డు!

ఎన్నో ప్రాణరక్షక మందులను కనుగొన్న డాక్టర్ ఎల్లాప్రగడ సుబ్బారావు పేరిట నెల్లూరులో స్థాపించిన ఆయన ఫౌండేషన్ స్మారక అవార్డును ఈ యేడాది, హైదరాబాదిలోని ఆవ్రా లేబరేటరీస్ ప్రైవేట్ లిమిటెడ్ ఛైర్మన్ మరియు ఎండి అయిన డాక్టర్ ఏ.వి.రామారావుకు ఇస్తున్నారు. జనవరి 12వ తేది నెల్లూరులోని హోటల్ శివం ఇంటర్నేషన్యల్‌లో ఈ అవార్డు ప్రదానం చేస్తున్నట్లు ఫౌండేషన్ ఛైర్మన్ డాక్టర్ ఎ.జగదీష్ చెప్పారు. ఎల్లాప్రగడ సుబ్బారావు ఫైలేరియాకు హెట్రోజన్, క్షయవ్యాధికి ఇనోనెక్స్, పిల్లల్లో బ్లడ్ క్యాన్సర్‌కు మెతో ట్రెక్సేట్, ఆరోమైసిన్, కలరా, టైఫాయిడ్, ప్లేగు నివారణకు టెట్రాసైక్లిన్, ఫ్లూ నివారణకు ఫోలిక్ ఆసిడ్‌ను కనుగొన్న గొప్ప డాక్టర్. వీరి పేరిట అవార్డునిస్తున్న డాక్టర్ ఏ.వి.రామారావు కూడా క్యాన్సర్ నివారణ మందు కనుగొనే పరిశోధనలో తలమునకలైన వ్యక్తి కావడం విశేషం.

## దుప్పట్లు పంపిణీ

క్రిస్టమస్‌ను పురస్కరించుకొని నెల్లూరు సెయింట్ పీటర్స్ వాకర్స్ అసోసియేషన్ నేతృత్వంలో 19వ తేది 300 మంది నిరుపేద వృద్ధులకు ఉచితంగా దుప్పట్లు పంచిపెట్టారు. ఈ కార్యక్రమంలో స్కూల్ కరస్పాండెంట్ ఆంథోనిరాజా, వాకర్స్ అసోసియేషన్ అధ్యక్షుడు కె.వెంకటేశ్వర్‌రావు, ఉపాధ్యక్షుడు రాజారావు, కార్యదర్శి దరిశి నరసింహారావు పాల్గొన్నారు.

## నాయక్ పాటల సీడీ ఆవిష్కరణ

హీరో రామ్‌చరణ్ తేజ నటించిన నాయక్ సినిమా పాటల సిడి ఆవిష్కరణ కార్యక్రమం నర్తకి థియేటర్‌లో చిరంజీవి యువత ఆధ్వర్యంలో ఘనంగా జరిగింది. చిరంజీవి, పవన్‌కళ్యాణ్, రామ్‌చరణ్, అల్లు అర్జున్ అభిమానులు కేక్ కట్‌చేసి సంబరాలు చేసుకొన్నారు. ఈ కార్యక్రమంలో చిరంజీవి యువత జిల్లా అధ్యక్షుడు రవికుమార్, కృష్ణారెడ్డి, సాయి, సుధీర్ తదితరులు పాల్గొన్నారు.



# రైతు లోకం — వేరుశనగలో వేరుకుళ్లు - నివారణ

మన జిల్లాలో వేరుశనగ పంట 15 రోజుల నుండి 50 రోజుల దశలో వున్నది. ఈ దశలో వేరు కుళ్లు తెగులు ఒక ప్రధానమైన సమస్య. ఈ తెగులు సుమారు 30రోజుల తర్వాత, వర్షాభావ పరిస్థితుల వలన ఎక్కువగా వస్తుంది. మొదట కాండం మీద గోధుమ వర్ణపు మచ్చలు ఏర్పడతాయి. కొన్ని రోజుల తర్వాత నలుపు వర్ణానికి మారి కాండం పైభాగానికి మరియు వేరుకు కూడా వ్యాపిస్తాయి. ఈ తెగులు వల్ల తల్లి వేరు కుళ్లిపోయి నలుపు రంగుకు మారి నుజ్జు, నుజ్జుగా తయారవుతుంది.

**నివారణ చర్యలు**

ఈ తెగులు నివారణకు తెగులు లేని పొలాల నుండి విత్తనాలను సేకరించి తప్పని సరిగా విత్తన శుద్ధి చేయాలి. ట్రైకోడర్మా విరిడి పార్ములేషన్ (2కిలోలు), పశువుల ఎరువు (90కిలోలు), మరియు వేపపిండి (10కిలోలు)ని కలుపుకొని 15రోజుల తర్వాత విత్తే ముందు పొలంలో వేసుకోవాలి. పొలంలో తెగులు ఆశించిన మొక్కలను పీకి కాల్చివేయాలి. తెగులు సోకిన మొక్కల చుట్టూ గల నేలను 0.3% (3 గ్రాములు / లీటరు నీటికి చొప్పున కలిపి) మ్యాంకోజెబ్ లేక కాపర్ ఆక్సీక్లోరైడ్ మందుతో తడిచేటట్లు పిచికారీ చేయాలి.

డాక్టర్ కె.పుల్లంరాజు
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.





